# ఈనాడు ఆదివారం

23 జులై 2017







Gillette






WRIGLEY'S

LEGO







SONY






BOEING

# మీలో ఎవరా కోటీశ్వరుడు!

# వంటల్లో వీళ్ల చేయి పడితేనా..!



సినిమాల్లో ఒంటి చేత్తో పది మందిని కొట్టడమే కాదు, బయట ఒంటి చేత్తో పది మందికీ వండి పెట్టడం కూడా మన స్టార్ హీరోలకి తెలుసు. నిజమండీ... ఎన్టీఆర్, చెర్రీ, రానా లాంటి వాళ్ల చేతి వంటని ఒక్కసారి రుచి చూస్తే, 'ఇంకొంచెం పెట్టరా' అని అడగకుండా ఉండలేమంటారు వాటిని తిన్నవాళ్లు!

## తారక్ పిజ్జా!

నటన విషయంలో తనకు తిరుగు లేదని ప్రతి సినిమాతో నిరూపించే ఎన్టీఆర్, మంచి వంటగాడన్న విషయం చాలామందికి తెలీదు. ఇంట్లో ఖాళీగా ఉన్నప్పుడూ, కాస్త ఒత్తిడిగా అనిపించినప్పుడూ తారక్ ఎక్కువగా వంట గదిలోనే గడుపుతాడట. ఒత్తిడి నుంచి బయటపడేందుకు తన భార్యకు నచ్చినవి వండిపెట్టడం అతడికి అలవాటు. స్నేహితులు కలిసినప్పుడు కూడా తన పాకశాస్త్ర ప్రావీణ్యాన్ని ప్రదర్శించడానికి తారక్ అస్సలు ఆలోచించడు. ఓసారి నటుడు ప్రకాష్‌రాజ్ ఫామ్‌ హౌజ్‌లో ఎన్టీఆర్ బిజీగా ఏదో వండుతున్నప్పుడు, 'చూడండి నా డార్లింగ్ నాకోసం ఏం చేస్తున్నాడో' అంటూ ప్రకాష్‌రాజ్ ఆ దృశ్యాల్ని సోషల్‌మీడియాలో పోస్ట్ చేశాడు. అన్ని రకాల వంటల్నీ తారక్ చేయగలడనీ, పిజ్జాల తయారీలో మాత్రం ఎక్స్‌పర్ట్ అనీ ప్రకాష్‌రాజ్ చెబుతాడు.

## చెర్రీ బిర్యానీ

చాలా సినిమాల్లో మాస్ కుర్రాడిగా కనిపించే రామ్‌చరణ్ వ్యక్తిగత జీవితానికి వచ్చే సరికి పక్కా ఫ్యామిలీ మ్యాన్. గుర్రపుస్వారీ, మార్షల్ ఆర్ట్సే కాదు, వంట చేయడమన్నా చెర్రీకి చాలా ఇష్టం. చాలా పదార్థాలను ప్రొఫెషనల్ షెఫ్‌లకు దీటుగా తయారు చేయగలడు. 'అన్ని వంటల్నీ చెర్రీ బాగా చేస్తాడు. టర్కీ పదార్థాల్ని మరీ అద్భుతంగా వండుతాడు. వీలు చిక్కిన ప్పుడల్లా ఇద్దరం కలిసే వంట చేసుకుంటాం' అంటుంది ఉపాసన. ఆంధ్రా బిర్యానీ, గోవా పలావ్, మలబార్ బిర్యానీ, దమ్ బిర్యానీ... ఇలా వివిధ రకాల బిర్యానీలు చేయడంలోనూ చెర్రీ దిట్ట. 'నా ప్రతి సినిమా విడుదలకు ముందు నాలో టెన్షన్ పెరుగుతూ ఉంటుంది. దాన్ని తగ్గించుకోవడానికి మా వంట గది చాలా సాయపడుతుంది' అంటాడు చరణ్.



## రానా పాతబస్తీ స్పెషల్

తెలుగు పరిశ్రమలో అతిపెద్ద భోజనప్రియుడు తానేనంటాడు రానా. హైదరాబాద్ ఓల్డ్ సిటీలో, బార్కాస్, నాంపల్లి లాంటి ప్రాంతాల్లో రానా కాలుపెట్టని హోటల్ లేదట. తినడమే కాదు, వండటమన్నా రానాకి అంతే ఆసక్తి. అదీ వేరే వాళ్ల కోసం వంట చేయడాన్ని మరింత ఇష్టపడతాడు. కూరలు తరగడం, శుభ్రం చేయడం లాంటి పనులు ఒత్తిడిని తగ్గిస్తే, వంట చేయడం తెలీని సంతోషాన్ని పంచుతుందని అతడు చెబుతాడు. ఇటలీ వంటకాలనూ, బిర్యానీలనూ రానా చాలా బాగా చేస్తాడట. చార్మినార్ దగ్గర షాదాబ్, పిస్తా హౌస్, ఆదాబ్ హోటళ్లకు వెళ్లినప్పుడల్లా, అక్కడి వంటశాలల్లోకి వెళ్లి బిర్యానీ, పాయా లాంటి వెరైటీల తయారీలో మెలకువలూ నేర్చుకొని, వాటిని ఇంట్లో ప్రయోగిస్తానంటాడు రానా.



## చైతూ... అన్ని వెరైటీలూ

చాలా కాలంగా హైదరాబాద్‌లో ఒంటరిగా ఉంటున్న నాగచైతన్యని 'వంట చేయడం వచ్చా?' అని అడగకూడదు, 'ఏది బాగా వండుతారు' అని అడగాలి. తన జీవితం కూడా అందరు బ్యాచిలర్ల లాంటిదే అనే చైతూ వెజ్, నాన్‌వెజ్, చైనీస్, మెక్సికన్ అన్న తేడా లేకుండా అన్ని రకాల వంటల్నీ అవలీలగా చేయగలడు. తన కోసం చైతూ వంట చేస్తున్న ఫొటోల్ని సమంతా సోషల్ మీడియాలో పోస్ట్ చేస్తూ, అతడి చేతి రుచుల్ని తెగ పొగిడేసింది. మొన్నీమధ్య రానాతో కలిసి ఓ టీవీ షోలో పాల్గొన్నప్పుడు కూడా చైతూ చకచకా కూరల్ని తరిగేసి అందర్నీ ఆశ్చర్యపరిచాడు. ఈ లెక్కన భోజనం విషయంలో సమంత చాలా అదృష్టవంతురాలే!



## నారావారి చేపలకూర

సినిమాల్లో నటించడమంటే ఎంత ఇష్టమో, దగ్గరివాళ్లకు వండిపెట్టడం కూడా అంతే ఇష్టమంటాడు నారా రోహిత్. అతడి చేతి రుచి ఎలా ఉంటుందో తెలియాలంటే అతడు నటించే సినిమాలకు పనిచేసే టెక్నీషియన్లని అడిగితే సరిపోతుంది. అప్పుడో సారి 'సావిత్రి' సినిమా చిత్రీకరణ సమయంలో యూనిట్‌లో అందరికీ రోహిత్ స్వయంగా చేపల పులుసు వండిపెట్టి ఆశ్చర్యపరిచాడు. ఈమధ్యే 'శమంతకమణి' షూటింగ్ సమయంలోనూ తాను యూనిట్ సభ్యుల కోసం చేపల కూర వండుతున్న వీడియోని రోహిత్ సోషల్ మీడియాలో పోస్ట్ చేశాడు. 'మనం నటించిన సినిమా బావుందని ప్రేక్షకులు చెప్పినా, మనం చేసిన వంట బావుందని తిన్నవాళ్లు చెప్పినా, ఆ కిక్కే వేరు' అంటాడు రోహిత్.






ఆ ఊళ్లో అందరూ సైనికులే... అక్కడ అందరూ ఉపాధ్యాయులే... ఇలా కొన్ని ఊళ్ల గురించి గొప్పగా చెప్పుకుంటారు కదా. జార్ఖండ్‌లోని బిన్సమి అనే ఊరి గురించి ఇప్పుడు అలాగే చెప్పుకొంటున్నారు. కాకపోతే గొప్పగా కాదు, పోలీసులే ఆశ్చర్యపోయే స్థాయిలో సైబర్ నేరాలకు పాల్పడినందుకు. వెయ్యి గడపలున్న ఈ ఊళ్లో తొమ్మిది వందల మంది సైబర్ నేరస్తులున్నారు. మహమ్మద్ జిలానీ అన్సారీ అనే నేరస్తుడి కోసం వెదుకుతూ వెళ్లిన అహ్మదాబాద్ సైబర్ శాఖ అధికారులకు ఊరి వ్యవహారం తెలిసింది.

## ఊరంతా సైబర్ నేరస్తులే...!




సైబర్ నేరాల్లో ఆ ఊరివారందరికీ తాత లాంటివాడు జిలానీ. అతను రెండు సెల్‌ఫోన్లతో ఏకంగా పదిహేను రాష్ట్రాలకు చెందిన ప్రజలను మోసం చేసినట్టు పోలీసుల విచారణలో తెలిసింది. అతడు రోజూ రెండువందల వరకూ ఫోన్‌కాల్స్ చేసేవాడట. ఏటీఎం కార్డు, క్రెడిట్‌కార్డుల పాస్‌వర్డూ, సీవీవీ నంబరూ చెప్పేలా కొందరినైనా ఒప్పించగలిగేవాడట. ఆ సమాచారంతో వారి అకౌంట్‌లోని డబ్బును తన ఈ-వ్యాలెట్‌లోకి బదిలీ చేసేవాడు. తర్వాత ఆ మొత్తాన్ని తన అకౌంట్‌లోకి మార్చుకునేవాడు. పది వేర్వేరు ఈమెయిల్ ఐడీలతో మొత్తం 34 ఈ-వాలెట్ ఖాతాలు ఉన్నాయి జిలానీకి. నేరస్తుడు ఒకచోట నేరం జరిగేది మరోచోట కావడం, ఫిర్యాదులేవీ అందకపోవడంతో స్థానిక పోలీసులు ఏమీ చేయలేకపోయేవారు. జిలానీని అదుపులోకి తీసుకున్న తర్వాత చాలా విషయాలు వెలుగులోకి వచ్చాయి. 14 మంది సభ్యులతో సైబర్ నేరాల రాకెట్‌ను నడిపిస్తున్నది టికూమండల్ అనీ, అతనే వాళ్లకి సిమ్ కార్డులు సరఫరా చేసి, వారు చేజిక్కించుకున్న సొమ్ములో కమీషన్ తీసుకుంటాడనీ, అయితే అతను ఎక్కడుంటాడో ఎవరికీ తెలియదనీ, వారానికోసారి వచ్చి ముఠా సభ్యుల నుంచి డబ్బు తీసుకుని మాయమైపోతాడనీ సైబర్ సెల్ అధికారి తెలిపారు. ఇప్పుడు పోలీసులు టికూమండల్‌ని పట్టుకోవడానికి పకడ్బందీ ప్రణాళిక రచిస్తున్నారు.

# లోపల...


| | |
|---|---|
| చురుక్కు చమక్కు | 4 |
| శుభాల మాసం శ్రావణం | 5 |
| పరిశోధన | 6 |


**మీలో ఎవరా కోటీశ్వరుడు!**




ప్రపంచవ్యాప్తంగా విస్తరించిన కోకాకోలా, కేఎఫ్‌సీ, బోయింగ్, లాంబోర్గిని లాంటి ఎన్నో భారీ సంస్థలు అనుకోని పరిస్థితుల్లో, అనూహ్య కారణాల వల్ల ప్రాణం పోసుకున్నాయి. మంచి వ్యాపార ఆలోచనల కోసం నెలల తరబడి బుర్రలు బద్దలు కొట్టుకోవాల్సిన పనిలేదనీ, ఒక్కోసారి మన చుట్టూ తిరిగే వ్యక్తులూ, జరిగే సంఘటనలే కొత్త ఐడియాల్ని ఇస్తాయని ఈ సంస్థల విజయం నిరూపిస్తుంది. **7**


| | |
|---|---|
| బతికేందుకు ఒక్క అవకాశమిద్దాం! | 11 |
| ఆట మళ్లీ మొదలైంది! | 12 |
| ఇంటర్నెట్ @ వన్ మినిట్! | 14 |
| వారసురాళ్లు వచ్చేస్తున్నారు..! | 15 |
| వానాకాలం కబుర్లు..! | 16 |
| కదంబం | 18 |
| ఆ రైల్లో పుస్తకాలు దాచిపెడతారు! | 19 |
| కథ | 20 |
| వైఫల్యాల మ్యూజియం! | 22 |
| రుచి అభిరుచి | 23 |
| బాల వినోదిని | 24 |
| అక్కడి పాఠశాలలో చదరంగం తప్పనిసరి! | 26 |
| రాశి ఫలం | 28 |
| సమీక్ష | 29 |
| పదవినోదం | 30 |


## మంచిమాట

**ఎవరైనా నవ్వితే నీవల్ల నవ్వాలి కానీ నిన్ను చూసి నవ్వకూడదు. ఎవరైనా ఏడిస్తే నీకోసం ఏడవాలి కానీ నీవల్ల ఏడవకూడదు.**

# మీమాట



ఈ సంచికపై మీ అభిప్రాయాలను sunday@eenadu.netకు మెయిల్ చేయవచ్చు.

### ఆలోచింపజేసింది

'ఐఐటీ అందరి సొత్తు' కథనం ఆలోచింపజేసింది. పేద విద్యార్థుల ఐఐటీ కలను నిజం చేస్తోన్న ఆనంద్‌కుమార్ అభినందనీయులు. ఆయన మూడువందల తొంభైఆరుమంది ఐఐటీయన్లను తయారుచేయడం ఆశ్చర్యపరిచింది.

*– తవుటు రాంచంద్రం, జగిత్యాల*

*– ఎన్.కవిత(ఈమెయిల్)*

### కష్టం విలువ

'టిప్' కథ వాస్తవానికి దగ్గరగా ఉంది. జీవితంలో కింది స్థాయి నుంచి పైకి వచ్చిన వారెవరికైనా కష్టం విలువ తెలుస్తుంది. కథను ముగించిన తీరు బాగుంది.

*– ఆర్. రఘుబీర్‌సింగ్, సుగుణాబాయి, ఏలూరు*

### కనువిందు

రకరకాల గోళ్ల రంగులు కనువిందు చేశాయి. గోళ్లరంగుల్లో ఇన్ని రకాలున్నాయని కొత్తగా తెలుసుకున్నాం. స్పోర్ట్సు బైకుల ధరలు ఆశ్చర్యపరిచాయి. మిస్టరీ రూమ్స్ గేమ్ సెంటర్లలోని ఆటలు బాగున్నాయి.

*– జి.అనూరాధ, మహబూబ్‌నగర్*

### గెలుపు పాఠం

స్పైస్‌జెట్ సంస్థ ఛైర్మన్ అజయ్ సింగ్ జీవిత విశేషాలు ఆకట్టుకున్నాయి. అమెరికా అధ్యక్షుడి ప్రశంసలనూ అందుకున్న అజయ్ ప్రస్థానం గెలుపు పాఠంలా ఉంది.

*– ఐ.చైతన్య, కొత్తగూడెం*

### అమూల్యం

రైతన్నకు అండగా నిలుస్తూ 'రైతు స్వరాజ్య వేదిక' అందిస్తోన్న సేవలు అమూల్యం. విద్యార్థులు ఒత్తిడికి గురికాకుండా ఆడుతూపాడుతూ చదువుకునేలా చేస్తున్న 'అభ్యాస విద్యాలయం' విధానం ఆదర్శనీయం.

*– పి.ఆదిత్యమూర్తి, గొల్లలమామిడాడ(తూ.గో.జిల్లా)*

### సందేహం లేదు

తమ సంస్థ ద్వారా ఎంతోమంది స్టాక్‌మార్కెట్లో పెట్టుబడులు పెట్టేలా చేస్తున్న నితిన్, నిఖిల్ సోదరులు అభినందనీయులు. వేల టన్నుల చెత్తను తొలగించి ముంబయి బీచ్‌ను శుభ్రపరిచిన అఫ్రోజ్ షా కృషి ఎంతోమందిలో స్ఫూర్తిని నింపుతుందనడంలో సందేహం లేదు.

*– డి.రామకృష్ణ, వైజాగ్*


కూటమి విడిపోదు!
లాలూ స్కాంలు
నితీశ్
లాలూ
శ్రీధర్


చురుక్కు
చమక్కు


టక్ టక్
టక్ టక్
జికా
భారత్‌కు జికా!
మలేరియా, డెంగీ
స్వైన్ ఫ్లూ


పంచశీలకు తూట్లు పొడుస్తున్నావు... హద్దులు మీరుతున్నావు...
చైనా
భారత్

# శుభాల మాసం శ్రావణం



**నల్లటి మబ్బులూ, పచ్చటి పొలాలూ, పసుపు కుంకుమల పండుగలూ, పాయసాన్నాల నివేదనలూ... శ్రావణ మాసం అడుగిడితే ఇంటింటా పచ్చతోరణం కళకళలాడాల్సిందే. వరాలతల్లి వ్రతాలే కాదు కన్నయ్య నుంచి గణపయ్య దాకా అందరి పండుగలూ ఈ నెలలో ఉన్నాయి మరి!**

**(రేపే శ్రావణం ప్రారంభం)**

మంగళవాయిద్యాలూ, పట్టుచీరల రెపరెపలూ, ధూపాల పరిమళాలూ, ముత్తయిదువల ముచ్చట్లూ... సందడంతా శ్రావణానిదే. పూలకొట్లు కళకళలాడతాయి, చీరల దుకాణాలు దుమ్మురేపుకుంటాయి, గడపలు పచ్చరంగేసుకుంటాయి, ముంగిళ్లు ముత్యాల ముగ్గులతో నిండిపోతాయి. పేరంటానికెళ్లి పెళ్లి సంబంధాలు మాట్లాడుకునే వాళ్లూ, నోముల పేరుతో కొత్త పరిచయాలు పెంచుకునేవాళ్లూ... పల్లె నుంచీ పట్టణం దాకా సందడి కావాలంటే శ్రావణం రావాల్సిందే. ఆహ్లాదకర వాతావరణంతో పాటూ ఆధ్యాత్మిక పరిమళమూ ఈ మాసానికి ఎక్కువే.

### ఎన్ని జయంతులో...

వరలక్ష్మీదేవి, హయగ్రీవుడు, శ్రీకృష్ణుడు, వరాహమూర్తి బదరీనారాయణుడు, సంతోషీ మాత... వీళ్లంతా ఈ నెల్లోనే జన్మించారట. శ్రావణ శుక్రవారాలు లక్ష్మీదేవి ఆరాధనకు మంచివి. మంగళవారాలు గౌరీ దేవిని పూజిస్తే సర్వసౌభాగ్యదాయకం. ఇక ఈ నెల్లోని సోమవారాలూ విశిష్టమైనవే. ఆ రోజుల్లో శివుడికి అభిషేకం చేస్తే ఎంతో మంచిదంటారు.

### కొత్త పెళ్లికూతుళ్లకు...

మాంగళ్యరూపిణి పార్వతీ దేవి. అందుకే శ్రావణమాసంలోని అన్ని మంగళవారాలూ మంగళగౌరీ నోములు నోచుకుంటారు ముత్తయిదువలు. కొత్త పెళ్లికూతుళ్లకు ఇవి మరింత ప్రత్యేకం. పెళ్లయిన తొలి శ్రావణ మాసం మొదలు ఐదేళ్లు నియమంగా ఈ నోములు నోచుకుని ఉద్యాపన చెప్పుకుంటారు. కోర్కెలు తీర్చే తల్లిగా వరలక్ష్మిని కొలుస్తారు. ఈ నెల్లోనే పౌర్ణమికి ముందు వచ్చే శుక్రవారం నాడు వరలక్ష్మీ వ్రతాన్నీ శ్రద్ధగా చేసుకుని వాయనాలు ఇచ్చుకుంటారు స్త్రీలు. ఏ కారణాల వల్లనైనా ఆరోజు కుదరకపోతే మిగతా శుక్రవారాల్లోనూ వ్రతాన్ని చేసుకోవచ్చు. ఈ మాసంలో వచ్చే శ్రవణానక్షత్రం రోజున సత్యనారాయణస్వామి వ్రతం చేసుకుంటారు. శ్రవణా నక్షత్రం స్వామి జన్మ నక్షత్రం కనుక ఈ రోజు వ్రతమాచరించడం అత్యంత ఫలదాయకంగా చెబుతారు.

### ప్రతి తిథీ ప్రత్యేకమే

శ్రావణ మాసంలో చాలా విశేష తిథులున్నాయి. శ్రావణ శుద్ధ పంచమిని గరుడ పంచమి అంటారు. గరుత్మంతుడు దేవలోకం నుంచి అమృతాన్ని అపహరించింది ఈ రోజే. నాగ, గరుడ జాతుల మధ్య వైరానికి స్వస్తి పలికిన ఈరోజు నాగులకు ప్రీతికరమైనది. అందుకే ఈ నెలలోని చవితితోపాటూ, పంచమి రోజు కూడా నాగులకు పూజలు నిర్వహిస్తారు. ఈ రెండు రోజులూ నాగదేవతను పూజిస్తే వంశవృద్ధీ, సంతానానికి శుభమూ జరుగుతాయట. గరుడ పంచమి రోజు గరుత్మంతుని పూజించడం వల్ల గొప్ప బల పరాక్రమాలు చేకూరుతాయి. శుద్ధషష్ఠి నాడు సూపౌదన వ్రతం చేస్తారు. ఆ రోజు నీలకంఠుణ్ని అర్చించి అన్నం, పప్పూ నివేదన చేస్తారు. శుద్ధ సప్తమిని సూర్య సప్తమి లేదా భాను సప్తమి అని పిలుస్తారు. ఆ రోజు సూర్యనారాయణుడికి పరమాన్నం నైవేద్యంగా పెడతారు. తర్వాత వచ్చే ఏకాదశిని పుత్రదా ఏకాదశి అంటారు. సంతానం లేని వాళ్లు ఈ ఏకాదశి వ్రతాన్ని చేస్తే సత్సంతానం కలుగుతుందట. తర్వాతి ద్వాదశిని దామోదర ద్వాదశి అంటారు. ఆ రోజు విష్ణుమూర్తిని పూజించాలి. త్రయోదశినాడు అనంగ వ్రతం చేస్తారు. కుంకుమాక్షతలూ, ఎర్రపూలతో రతీ మన్మథులని పూజించాలి. అలాచేస్తే దాంపత్య సౌభాగ్యం లభిస్తుందట. శుద్ధ చతుర్దశి రోజు వరాహ జయంతి. శ్రీమహావిష్ణువు వరాహ రూపంలో హిరణ్యాక్షుడనే రాక్షసుడ్ని సంహరించిన రోజు ఇదే. ఆ రోజు విష్ణుసహస్రనామాన్ని పఠించడం వల్ల సకల పాపాలూ తొలగిపోతాయన్నది శాస్త్రోక్తి.

### పౌర్ణమి విశిష్టం

శ్రావణ శుద్ధ పౌర్ణమిని రాఖీ పౌర్ణమి అని పిలుస్తారు. తోబుట్టువులు ఒకరికొకరు రక్షగా ఉండాలన్న సందేశాన్నిస్తూ సోదరీసోదరులు ఈ రోజు రక్షాబంధనాన్ని కట్టుకుంటారు. సంతోషీమాత జన్మించింది కూడా ఈ రోజే. అందరూ అక్కచెల్లెళ్లతో రాఖీ కట్టించుకుంటుంటే తమకూ కట్టించుకోవాలనిపిస్తోందని గణపతి, కుమారస్వామి శివపార్వతుల్ని అడిగారట. దాంతో శ్రావణ శుద్ధ పౌర్ణమినాడే సంతోషీమాత ఆవిర్భావం జరిగిందట. ఈ రోజునే హయగ్రీవ జయంతి కూడా. గుర్రం ముఖం, మనిషి శరీరం ఉండే ఈ స్వామిని జ్ఞానదేవతగా చెబుతారు. బ్రహ్మదేవుడి నుంచి వేదాలను దొంగిలించిన సోమకాసురుడనే రాక్షసుడ్ని సంహరించేందుకు మహావిష్ణువు ఈ అవతారం ఎత్తాడు. మహాలక్ష్మికి ధనాధిపత్యాన్ని అనుగ్రహించిందీ, సరస్వతికి అక్షరాభ్యాసం చేసిందీ ఈ స్వామే. అందుకే ఈ రోజు అక్షరాభ్యాసాలకూ మంచిది. ఈ పౌర్ణమిని జంధ్యాల పౌర్ణమి అని కూడా పిలుస్తారు. ఈ రోజు పాత యజ్ఞోపవీతాన్ని తీసి, కొత్త యజ్ఞోపవీతాన్ని ధరిస్తారు.

కృష్ణపక్షంలో వచ్చే చవితిని సంకటహర చతుర్థి అంటారు. ఆ రోజు గణపతిని పూజిస్తే ఎంతటి ఉపద్రవాలైనా తొలగిపోతాయంటారు. ఇక, గోపాలకృష్ణుడి జన్మతిథి శ్రావణ బహుళ అష్టమినే కృష్ణాష్టమిగా జరుపుకుంటారు. కన్నయ్య పాదాలను ఇంట్లో వేసి వెన్నా, పాలూ, మీగడ పెరుగూ నైవేద్యంగా పెడతారు. శ్రీకృష్ణుడి విగ్రహానికి పాలతో అభిషేకం చేసి, రాత్రిపూట ఉయ్యాల్లో ఉంచి జోల పాడతారు. ఉట్టి కొట్టడం ఈ రోజు సందడిని నెలకొల్పే కార్యక్రమం. తర్వాత వచ్చేది కోర్కెలు తీర్చే కామదా ఏకాదశి. మాసం చివర వచ్చే పోలాల అమావాస్యను పల్లెటూళ్లలో ప్రత్యేకంగా జరుపుకుంటారు. ఆ రోజు పశువులకు పూజ చేస్తారు. దీనివల్ల అకాల మృత్యువు తొలగిపోతుందన్నది శాస్త్రోక్తి. మొత్తానికి శ్రావణం ఆసాంతం పండుగలమయం, పరమ పవిత్రం. ★

# వసలో ఏముంది?




ఎక్కువగా మాట్లాడేవాళ్లను వసపిట్టలనీ, వాళ్లకు చిన్నప్పుడు బాగా వసబోసి ఉంటారనీ అంటుంటారు. కానీ వస అనేది ఆయుర్వేదంలో అత్యంత శక్తిమంతమైన ఔషధం. దీని సంస్కృతనామం వచ. అదే తెలుగులో వసగా మారింది. గడ్డి జాతికి చెందిన ఈ ఔషధ మొక్క వేరు పిల్లలకు వచ్చే అన్ని రకాల వ్యాధులనీ తగ్గిస్తుందట. అందుకే దీన్ని పిల్లల ఔషధం అనీ పిలుస్తారు. ఒకలాంటి తియ్యని వాసనతో ఉండే దీని వేరుని ఎండబెట్టి పొడి చేసి ఆయుర్వేదంలో రకరకాలుగా వాడుతుంటారు.



★ తరచూ అజీర్తితో బాధపడే పిల్లలకు దీని వేరుని మంటమీద కాల్చి, పొడి చేసి, ఓ చిటికెడు పొడిని తల్లి పాలతో కలిపి తాగిస్తారు. అరకప్పు మరిగించిన నీళ్లలో ముప్పావు టీస్పూను శొంఠిపొడి, చిటికెడు వసపొడి వేసి తాగితే పెద్దవాళ్లలోనూ జీర్ణ సమస్యలు తగ్గుముఖం పడతాయి.

★ పిల్లల చేతికి ఈ వేరుని కంకణంగా కడుతుంటారు. వాళ్లు దాన్ని నోట్లో పెట్టుకుని చీకుతుంటే ఆ రసం కొంచెంకొంచెంగా కడుపులోకి వెళ్లి బ్యాక్టీరియా, వైరస్లలాంటివి పొట్టలోకి చేరకుండా ఉంటాయట.

గొంతునొప్పి, దగ్గులతో బాధపడేవాళ్లు చిన్న వస ముక్కని దంచి, కాసేపు నోట్లో పెట్టుకుని, కొంచెం కొంచెంగా ఆ రసాన్ని మింగితే ఉపశమనం ఉంటుంది. అలాగే మాటలు త్వరగా రానివాళ్లకి కూడా చిటికెడు పొడిని తేనెతో కలిపి నాకిస్తారు.

★ మతిమరపు, డిప్రెషన్, మూర్ఛ... వంటి నరాల సంబంధ వ్యాధులతో బాధపడేవాళ్లకి వస వేరుని దంచి, మరిగించి, చల్లార్చిన డికాక్షన్ని ఇవ్వడం వల్ల మంచి ఫలితం ఉంటుందట.

★ డయేరియాకీ ఇది మంచి మందే. చిటికెడు వస పొడిని తేనెతో కలిపి ఇస్తే డయేరియా కూడా తగ్గుతుంది.

★ దీన్నుంచి తీసిన గాఢ తైలాన్ని చర్మసంబంధ ఇన్ఫెక్షన్లు, తలనొప్పి, ఆర్థ్రయిటిస్, కీళ్లనొప్పులు తగ్గడానికి వాడుతుంటారు.

★ వసపొడిని కాసిని నీళ్లలో కలిపి ఇంట్లో అక్కడక్కడా చల్లడం ద్వారా కీటకాలను అడ్డుకోవచ్చు. అలాగే దీన్ని పలుచని బట్టలోకట్టి కబోర్డులూ బీరువాల్లో పెట్టితే బొద్దికలూ తెల్లని పుస్తకాల పురుగుల్లాంటివి చేరకుండా ఉంటాయి.

## రోజుకి పదివేల అడుగులు!

నడక మంచిదన్నది తెలిసిందే. దానివల్ల మధుమేహం, హృద్రోగాలు వంటివి రాకుండా ఉండటంతోబాటు మానసిక ఆరోగ్యమూ మెరుగవుతుంది. ముఖ్యంగా రకరకాల ఆహార పదార్థాలు తినాలన్న కోరిక తగ్గుతుందని ఇటీవల చేసిన కొన్ని అధ్యయనాల్లో తేలింది. అందుకే రోజుకి కనీసం పదివేల అడుగులు వేస్తే అన్ని విధాలా మంచిదని సూచిస్తున్నారు ఆరోగ్య నిపుణులు. అందులో భాగంగా ఒకేసారి వేగంగా అరగంటసేపు నడిచినా సరే, లేదంటే పది నిమిషాల చొప్పున మూడు విడతలుగా నడిచినా మేలేనట. ఆలస్యం అమృతం విషం... అంటుంటారు. అందుకే ఇప్పుడే నడవడం మొదలెట్టండి మరి.



## నెలసరి నొప్పితో సతమతమవుతున్నారా?

ప్రపంచవ్యాప్తంగా పదిశాతం నెలసరి సమయంలో తీవ్రమైన నొప్పితో బాధపడుతుంటారు. అయితే అది సాధారణమేననీ అదే తగ్గుతుందనీ భావిస్తారు. కానీ అది మరీ ఎక్కువగా ఉంటే దాన్ని పట్టించుకుని తీరాలనీ లేదంటే అది ఎండోమెట్రియాసిస్కు దారితీస్తుందనీ తద్వారా సంతాన సాఫల్యతలో సమస్యలు తలెత్తుతాయని యూనివర్సిటీ ఆఫ్ ఎడిన్బర్గ్కు చెందిన నిపుణులు పేర్కొంటున్నారు. ఇందుకోసం వీళ్లు సంతానరాహిత్యంతో బాధపడుతోన్న 422 మంది మహిళల్ని ఎంపిక చేసి పరిశీలించగా- వాళ్లలో అత్యధికంగా మూడొంతుల మంది ఎండోమెట్రియాసిస్తో బాధపడుతున్నట్లు తేలింది. అంతేకాదు, ఎండోమెట్రియాసిస్ కారణంగా తలెత్తే నొప్పి తీవ్రత పెరిగేకొద్దీ గర్భం దాల్చడం మరింత ఆలస్యమవుతున్నట్లు గుర్తించారు. అందుకే నెలసరి నొప్పి తీవ్రతను బట్టి ముందుగానే ఎండోమెట్రియాసిస్ను గుర్తించి దానికి తగిన చికిత్స తీసుకోగలిగితే సంతాన సమస్యలు తలెత్తకుండా ఉంటాయని సదరు నిపుణులు చెబుతున్నారు.



## టూకీగా...

తీవ్రమైన ఒత్తిడిలో ఉన్నప్పుడు తెచ్చిపెట్టుకున్న కృత్రిమ నవ్వు కూడా గుండె వేగాన్ని తగ్గిస్తుందనీ, తద్వారా ఆరోగ్యానికి మేలు చేకూరుతుందనీ లండన్ నిపుణులు చేసిన ఓ అధ్యయనంలో తేలింది.

★ ఏకబిగిన పనిచేయడంకన్నా ప్రతి గంటన్నరకీ ఒకటీ లేదా రెండు నిమిషాలపాటు గట్టిగా ఊపిరి పీల్చి వదలడం, ఒళ్లు ఒకసారి విరుచుకోవడం... వంటి వాటి ద్వారా విరామం తీసుకుంటే మళ్లీ ఉత్సాహంగా పనిచేయవచ్చు.

★ ఒకే భాష మాట్లాడేవారితో పోలిస్తే రెండు రకాల భాషలు మాట్లాడే పిల్లలు సమాచారాన్ని గ్రహించడంలోనూ గొంతుల్ని గుర్తించడంలోనూ చురుగ్గా ఉంటారని న్యూయార్క్ విశ్వవిద్యాలయానికి చెందిన నిపుణుల పరిశీలనలో తేలింది.

## సాదా సబ్బులే ముద్దు!

చాలామంది సూక్ష్మక్రిములు చనిపోతాయన్న కారణంతో యాంటీ మైక్రోబియల్ సబ్బులతో తెగ రుద్దేస్తూ ఉంటారు. కానీ వాటివల్ల ఎలాంటి ఫలితమూ ఉండకపోగా, వాటిల్లో వాడుతోన్న రసాయనాల కారణంగా హాని ఎక్కువని అనేక శాస్త్ర బృందాలు పేర్కొంటున్నాయి. ముఖ్యంగా శాన్ఫ్రాన్సిస్కోకి చెందిన నిపుణుల పరిశీలనల ప్రకారం- అందులోని ట్రైకోసన్ అనే పదార్థం రకరకాల ఫుడ్ అలర్జీలూ, ఆస్తమాలకూ దారితీస్తుందట. సంతాన సాఫల్యత మీదా దుష్ఫలితాలను కనబరుస్తోంది. అంతేకాదు, వాటి కారణంగా బ్యాక్టీరియాలకు మరింత నిరోధకశక్తి పెరిగి సూపర్బగ్స్గా అవతరించవచ్చు. కాబట్టి వీటి కారణంగా ఎలాంటి ఉపయోగమూ లేదని హెచ్చరిస్తున్నారు సదరు శాస్త్రవేత్తలు.

# మీలో ఎవరా కోటీశ్వరుడు!




క్రికెట్ దిగ్గజాలు చాలామంది ఉన్నారు. కానీ ధోనీ ప్రత్యేకత వేరు. దేశానికి ఎందరో ప్రధానులయ్యారు. కానీ మోదీ స్థానం వేరు. సినిమాల్లో బోలెడంతమంది సూపర్‌స్టార్లు ఉన్నారు. కానీ రజనీకాంత్ గుర్తింపు వేరు. టికెట్ కలెక్టర్‌గా, చాయ్‌వాలాగా, బస్‌కండక్టర్‌గా... ఇలా అత్యంత సాధారణ నేపథ్యమున్న వీళ్లంతా ఎక్కడో అట్టడుగు స్థాయిలో జీవితాన్ని మొదలుపెట్టి ఎవరూ ఊహించనంత ఎత్తుకు ఎదిగారు. ఆ లెక్కన కోకాకోలా, సోనీ, కేఎఫ్‌సీ, డాబర్, బోయింగ్ లాంటి వ్యాపార సంస్థల పేర్లనూ వీళ్ల పక్కనే చేర్చాలి. అవి కూడా అనామక సంస్థలుగానే మార్కెట్‌లోకి వచ్చి వాటి యజమానులు కూడా ఊహించని స్థాయికి చేరుకున్నాయి మరి. ఆ వ్యక్తుల జీవితాల్లానే, ఈ సంస్థల విజయాల వెనకా బోలెడు కథ ఉంది. ఆ కథల్లో బోలెడు కిక్కుంది.

ఏదో సినిమాలో చెప్పినట్టు... జీవితం కోడిగుడ్డు లాంటిది. ఏది పిల్లవుతుందో, ఏది ఆమ్లెట్ అవుతుందో తెలీదు. మంచి వ్యాపార ఆలోచన కూడా అలాంటిదే. ఏ ఆలోచన గొప్ప సంస్థగా ఎదిగి జనాల్లోకి దూసుకెళ్తుందో, ఏది అట్టర్ ఫ్లాపై యజమానిని నట్టేట ముంచుతుందో ఎవరూ ఊహించలేరు. రెండో రకానికి చెందిన వ్యాపారాలు లక్షల్లో ఉంటాయి. కానీ ఏవో కొన్ని మాత్రమే అనుకోకుండా ప్రారంభమై, అనూహ్యంగా ప్రజల ఆదరణ దక్కించుకొని ప్రపంచ స్థాయి సంస్థలుగా ఎదుగుతాయి. ఎలక్ట్రానిక్ రంగంలో ప్రపంచాన్ని శాసిస్తున్న సోనీ, శీతల పానీయాల్లో తిరుగులేని కోకాకోలా, చికెన్ వెరైటీలకు పెట్టింది పేరైన కేఎఫ్‌సీ, స్పోర్ట్స్ కార్ల మార్కెట్‌లో దూసుకెళ్తున్న లాంబోర్గిని... ఇవన్నీ అట్టడుగుస్థాయి నుంచే తమ ప్రయాణాన్ని మొదలుపెట్టాయి. అనూహ్య పరిస్థితులవల్లో, అనుకోని సంఘటనల కారణంగానో ఈ సంస్థలన్నీ ప్రారంభమై, వాటి యజమానులు కూడా ఊహించలేనంత ఉన్నత స్థాయికి ఎదిగాయి. గొప్ప వ్యాపార ఆలోచనల కోసం మేధో మథనం జరపాల్సిన అవసరం లేదనీ, రోజువారీ జీవితంలో ఎదురయ్యే పరిస్థితులే మనకు కొత్త దారి చూపిస్తాయనీ చెప్పడానికి వీటి విజయాలే సాక్ష్యాలు.

## అవమానానికి బదులుగా... లాంబోర్గిని!

తగిలిన రాళ్లనే పునాదిగా చేసుకొని ఎదగాలంటారు... ప్రపంచంలోనే అత్యంత విలాసవంతమైన స్పోర్ట్స్ కార్లను తయారు చేసే 'లాంబోర్గిని' సంస్థ యజమాని ఫెరూషియో లాంబోర్గిని అచ్చంగా అలానే ఎదిగాడు. తనకు జరిగిన అవమానానికి బదులుగా అత్యుత్తమ స్పోర్ట్స్ కార్ల తయారీ సంస్థకు ప్రాణం పోశాడు. ఫెరూషియోది ఇటలీలోని ఓ రైతు కుటుంబం. తొలిరోజుల్లో ట్రాక్టర్ల మెకానిక్‌గా పనిచేసిన ఫెరూషియో, తరవాత వ్యవసాయ పనిముట్లు తయారు చేసే సంస్థని నెలకొల్పాడు. ఆ వ్యాపారంలో బాగా సంపాదించిన అతడు, ఏరికోరి ఓ ఫెరారీ కారుని కొనుక్కున్నాడు. కానీ దాని క్లచ్‌తో ఫెరూషియోకి నిత్యం ఇబ్బందులు ఎదురయ్యేవి. దాని మరమ్మతుల కోసం తరచూ సర్వీస్ సెంటర్ల చుట్టూ తిరిగేవాడు. తానుకూడా మెకానిక్కునేననీ, దాన్ని రిపేర్ చేసే పద్ధతిని చూపిస్తే ఆ పనేదో తానే చేసుకుంటాననీ ఫెరూషియో చెప్పినా సర్వీస్ సెంటర్ వాళ్లు ఒప్పుకోలేదట. దాంతో ఎలాగో కష్టపడి ఫెరారీ సంస్థ వ్యవస్థాపకుడు ఎంజో ఫెరారీని కలిసిన ఫెరూషియో ఆయనకు తన సమస్యని చెప్పి, ఫెరారీ కార్లు అస్సలు బాలేవని అన్నాడట. దాంతో ఎంజో ఫెరారీకి కోపమొచ్చి, 'సమస్య మా కార్లది కాదు, దాన్ని నడిపే డ్రైవర్‌ది. ట్రాక్టర్లని నడిపినట్టు ఫెరారీ కారుని నడపకూడదు' అని బదులిచ్చాడట. ఆ మాటతో ఫెరూషియోకి ఉక్రోషం మొదలైంది. ఫెరారీకి దీటుగా తానే సొంతంగా ఓ స్పోర్ట్స్ కార్‌ని తయారు చేయాలని నిర్ణయించుకున్నాడు. తెలిసిన కొందరు ఇంజినీర్ల సాయంతో ఇంజిన్ తయారీ మొదలుపెట్టాడు. అది బాగా పనిచేయడంతో, తన వ్యాపారాన్నీ ఇతర ఆస్తుల్నీ అమ్మేసి తన పేరు మీదే 'లాంబోర్గిని' అనే కార్ల తయారీ సంస్థని మొదలుపెట్టాడు. ఇక ఆ తరవాత అంతా అందరికీ తెలిసిన చరిత్రే. కోటి రూపాయలకు పైగా ధర పలికే లాంబోర్గిని కారుని సొంతం చేసుకోవాలని చాలామంది సంపన్నులు తహతహలాడుతుంటారు. కోపాన్ని కూడా సరైన దారిలో చూపిస్తే ఇంత మంచి ఫలితాలొస్తాయన్నమాట!





## తలనొప్పికి మందు... కోకాకోలా

స్కూళ్లూ, నీళ్లూ, రోడ్లూ లేని ఊళ్లు బోలెడుంటాయి. కానీ కిళ్లీ కొట్టూ, అందులో చిన్న ఫ్రిజ్, దాంట్లో కోకాకోలా సీసా ఉండని గ్రామాలు మాత్రం చాలా అరుదు. ఆసియా నుంచి అంటార్కిటికా దాకా అన్ని ఖండాల్లో, రెండొందలకు పైగా దేశాల్లో ఈ శీతల పానీయం దొరుకుతుంది. కొత్తగా ఎన్ని కూల్‌డ్రింక్‌ల సంస్థలు వెలిసినా, 130 ఏళ్లుగా మార్కెట్‌లో కోకాకోలా తన స్థానాన్ని కాపాడుకుంటూనే వస్తోంది. ఏటా వందల కోట్ల రూపాయల మేర అమ్మకాల్ని సాగించే ఈ పానీయం, మొదట తలనొప్పికి మందులా తయారైందని ఎవరూ ఊహించలేరు. 1880ల్లో అమెరికాలో కలర్ సోడాలు బాగా అమ్ముడయ్యేవి. జాన్ పెంబర్టన్ అనే ఫార్మసిస్టుని ఆ సోడాలు బాగా ఆకర్షించాయి. అప్పటికే పెంబర్టన్ రకరకాల ఆరోగ్య సమస్యలకు మందులు తయారు చేసి పేటెంట్లను తీసుకున్నాడు. కానీ అవేవీ ఆశించినంత ఆదాయాన్ని ఇవ్వలేకపోయాయి. దాంతో చివరి ప్రయత్నంగా కోకా ఆకుల్నీ, కోలా నట్స్‌తో మరికొన్ని పదార్థాల్నీ కలిపి జనాలు ఎక్కువగా ఇష్టపడుతున్న సోడాల తరహాలోనే ఓ పానీయాన్ని తయారు చేశాడు. దానికి తలనొప్పీ, అలసటని దూరం చేసే శక్తి ఉందని ప్రచారం చేసి, దానికి ఔషధంగానే పేటెంట్ తీసుకొని మందుల దుకాణాల్లో అమ్మడం మొదలుపెట్టాడు. కోకాకోలా అమ్మకాలు క్రమంగా పెరిగినా, పెంబర్టన్‌కి ఆ సంతోషం ఎంతో కాలం నిలవలేదు. మత్తుమందులకు బానిసగా మారిన పెంబర్టన్, డబ్బుల కోసం తన కోకాకోలా ఫార్ములాని క్యాండ్లర్ అనే మరో వ్యక్తికి అమ్మేశాడు. ఆ పైన కొన్ని రోజులకే అనారోగ్యంతో పెంబర్టన్ కన్నుమూశాడు. తరవాత క్యాండ్లర్ తనదైన శైలిలో మార్కెటింగ్ చేస్తూ సంస్థని విస్తరించాడు. కొన్నాళ్లకు అమెరికా ప్రభుత్వం ఔషధాలపైన పన్ను పెంచడంతో, కోకాకోలాని ఔషధాల జాబితా నుంచి తొలగించి శీతల పానీయంగా క్యాండ్లర్ రిజిస్ట్రేషన్ చేయించాడు. 130ఏళ్లు దాటినా ఇప్పటికీ దాదాపుగా పెంబర్టన్ కనిపెట్టిన ఫార్ములాతోనే కోక్‌ని తయారు చేస్తున్నారు. అతడు ఓ ఔషధంలా దాన్ని తయారుచేశాడు తప్ప, కూల్‌డ్రింక్‌లా అన్ని దుకాణాల్లో అమ్మాలని ఏనాడూ అనుకోకపోవడం విశేషం.




## జాన్ డీర్... ఓ రైతు సలహా!

నగరవాసులకు పెద్దగా పరిచయం లేకపోయినా, 'జాన్ డీర్' అన్న పేరు చెప్పగానే కాళహస్తి నుంచి కల్వకుర్తిదాకా చాలామంది పల్లెవాసులు ఆ సంస్థను గుర్తుపడతారు. దేశవ్యాప్తంగా వందలాది పల్లెల్లో 'జాన్ డీర్' దుకాణాలు కనిపిస్తాయి. వ్యవసాయ పనిముట్లూ, యంత్రాల తయారీ రంగంలో ప్రపంచంలోనే అతిపెద్ద సంస్థ అది. ఏటా వేల కోట్ల రూపాయలు విలువ చేసే వ్యవసాయ పరికరాల్ని 'జాన్ డీర్' విక్రయిస్తుంది. అలాంటి కంపెనీకి ప్రాణం పోసిన జాన్ డీర్ ఓ సాధారణ కమ్మరి. చిన్నప్పుడు జాన్‌డీర్ తన తండ్రి దగ్గర సూదులూ, చాకులను సానపెట్టడం నేర్చుకున్నాడు. పెద్దయ్యాకా అతడు అదే రంగంలో కొనసాగుతూ క్రమంగా వ్యవసాయ పనిముట్లకు పదును పెడుతూ, వాటికి మరమ్మతులు చేసే వృత్తిలో స్థిరపడ్డాడు. చెక్కతో, ఇనుముతో చేసిన నాగళ్లు అన్ని నేలలకూ సరిపోవట్లేదనీ, తన అనుభవంతో ఏదైనా మరింత పదునైన నాగలిని తయారు చేయమనీ తెలిసిన ఓ రైతు ఓసారి జాన్ డీర్‌ని అడిగాడు. పదునైన స్టీలు భూమిలోకి సులువుగా దిగుతుందనీ, మిగతా వాటితో పోలిస్తే అది తేలిగ్గానూ ఉంటుందనీ గ్రహించిన జాన్ డీర్, ఆ రైతు కోసం ఓ స్టీలు నాగలిని తయారు చేసిచ్చాడు. ఆపైన మరో ముగ్గురు రైతులు అడిగి మరీ అలాంటి నాగలినే తయారు చేయించుకున్నారు. ఏటికేడూ వాటిని తయారు చేయించుకునే రైతుల సంఖ్య పెరుగుతూ వచ్చింది. దాంతో డీర్ వ్యవసాయ పనిముట్ల మరమ్మతులను పూర్తిగా ఆపేసి సొంతంగా నాగళ్లను తయారు చేయడం ప్రారంభించాడు. అది క్రమంగా ఇతర యంత్రాలకూ విస్తరిస్తూ ఇప్పుడు ట్రాక్టర్లూ, కోత యంత్రాలూ, ఫీల్డు స్ప్రేయర్లంటూ అన్ని రకాల వ్యవసాయ పరికరాల తయారీకి చేరింది. అలా ఓ రైతు ఇచ్చిన సలహా, ప్రపంచ వ్యవసాయాన్ని ఆధునిక బాట పట్టించే దిశగా జాన్ డీర్‌ని నడిపించింది.




## కొడుకు కోసం లెగో!

దాదాపు డెబ్భై ఐదేళ్లుగా పిల్లలు లెగో బొమ్మలతో ఆడుకుంటున్నారు. చిన్నచిన్న ప్లాస్టిక్ 'లెగో బ్రిక్స్' సాయంతో పెద్ద పెద్ద లెగో బొమ్మల్ని తయారు చేస్తూ ఆనందిస్తున్నారు. ప్రపంచంలో అత్యధిక సంఖ్యలో అమ్ముడయ్యే పిల్లల బొమ్మలను లెగో సంస్థే ఉత్పత్తి చేస్తోంది. ఆ భారీ బొమ్మల సామ్రాజ్యానికి పునాది వేసింది ఓ సాధారణ కార్పెంటర్. దాదాపు ఎనభై ఏళ్ల క్రితం క్రిస్టియన్‌సన్ అనే వ్యక్తి ఇంటి దగ్గరే వడ్రంగి పనులు చేసుకునేవాడు. తన కొడుకు పనికి అడ్డు తగిలి ఇబ్బంది పెట్టకుండా, వృథా చెక్కతో బొమ్మలు తయారు చేసిచ్చి ఆడుకోమనేవాడు. వాటిని చూసి తక్కిన పిల్లలూ తమకూ ఆ బొమ్మలు కావాలని మారాం చేయడం, వాళ్ల బాధ పడలేక తల్లిదండ్రులొచ్చి డబ్బులిచ్చి అలాంటి బొమ్మల్ని తయారు చేయించుకొని వెళ్లడం పరిపాటైంది. అదేదో లాభసాటిగా ఉందనిపించి క్రిస్టియన్‌సన్ కొన్నాళ్లకు ఫర్నీచర్ తయారీ మానేసి పూర్తిగా బొమ్మల్నే తయారు చేయడం మొదలుపెట్టాడు. బయట క్రమంగా ప్లాస్టిక్ బొమ్మల వాడకం పెరగడంతో క్రిస్టియన్‌సన్ కూడా చెక్క బొమ్మలకు స్వస్తి పలికి, అవే బొమ్మలను ప్లాస్టిక్‌తో చేయసాగాడు. కానీ తాను చిన్నప్పుడు మట్టితో బొమ్మల్ని సొంతంగా తయారు చేసుకున్నప్పుడు కలిగిన ఆనందాన్ని, ఆ ప్లాస్టిక్ బొమ్మలు పిల్లలకు ఇవ్వలేవేమోనని క్రిస్టియన్‌సన్‌కి సందేహం కలిగింది. దాంతో పెద్ద పెద్ద బొమ్మల తయారీ ఆపేసి, 'లెగో బ్రిక్స్' పేరుతో చిన్న చిన్న విడిభాగాల రూపంలో ఆట వస్తువుల్ని తయారు చేయడం మొదలుపెట్టాడు. ఆ లెగో బ్రిక్స్‌ని క్రమ పద్ధతిలో అమరిస్తే పెద్ద బొమ్మలు తయారయ్యేలా ఏర్పాటు చేశాడు. ఆ రంగురంగుల లెగో బ్రిక్స్, వాటితో సొంతంగా తయారు చేసే బొమ్మలూ పిల్లలకు తెగనచ్చేశాయి. అలా కొడుకు సరదా కోసం క్రిస్టియన్‌సన్ తయారు చేసిన బొమ్మలే, ఇప్పుడు కోట్ల రూపాయల్ని సంపాదిస్తున్నాయి.



# 65ఏళ్లకు కేఎఫ్‌సీ!

చికెన్ 65, చికెన్ టిక్కా, చికెన్ కబాబ్... ఇలాంటి చికెన్ వెరైటీల గురించి తెలియని వాళ్లుంటారేమో కానీ, 'కేఎఫ్‌సీ చికెన్' పేరు చెప్పగానే చిన్న పిల్లలు కూడా లొట్టలేస్తారు. కొన్నేళ్ల క్రితం దాకా పాశ్చాత్య దేశాలకూ నిన్న మొన్నటిదాకా దేశంలోని పెద్ద నగరాలకూ పరిమితమైన కేఎఫ్‌సీ రెస్టరెంట్లు ఇప్పుడు చిన్నచిన్న పట్టణాలకూ విస్తరించాయి. చికెన్ రెస్టరెంట్లలో ప్రపంచంలోనే నంబర్ వన్‌గా ఉన్న కేఎఫ్‌సీ, ఏటా వందల కోట్ల రూపాయల వ్యాపారాన్ని నిర్వహిస్తోంది. సంస్థకు కాసుల వర్షం కురిపిస్తున్న అంత విలువైన చికెన్ ఫార్ములాని కల్నల్ సాండర్స్ అనే అమెరికన్ షెఫ్ ఒకాయన సృష్టించాడు. ఓ చిన్న హోటల్‌లో వంటమనిషిగా పనిచేసే సాండర్స్ అరవై ఐదేళ్ల వయసులో ఆ పని నుంచి రిటైరయ్యాడు. సాండర్స్ వండే చికెన్ పదార్థాలంటే అతడి సన్నిహితులు పడిచచ్చేవారు. ఆ వంటల ఫార్ములాని ఏదైనా హోటల్‌కి అమ్మితే, దాని ద్వారా వచ్చే రాయల్టీతో తన జీవితం సాఫీగా గడిచిపోతుందన్న ఆలోచన సాండర్స్‌కి కలిగింది. దాంతో తన చికెన్ పదార్థాల్ని తమ మెనూలో చేర్చమని అక్షరాలా 1009 హోటళ్ల చుట్టూ తిరిగాడట. ఎవరూ ఒప్పుకోకపోవడంతో తప్పని పరిస్థితుల్లో స్నేహితుల సాయంతో సాండర్సే అరవై ఐదేళ్ల వయసులో అమెరికాలో 'కెంటకీ ఫ్రైడ్ చికెన్' (కేఎఫ్‌సీ) పేరుతో రెస్టరెంట్‌ని మొదలుపెట్టాడు.




కేఎఫ్‌సీ రుచులకు కెంటకీ ప్రాంతంలో బాగా పేరు రావడంతో నెమ్మదిగా ఒక్కొక్కరూ సాండర్స్‌ని కలిసి దాని ఫ్రాంచైజీలను కొనుగోలు చేయసాగారు. కొన్నాళ్లకు వృద్ధాప్యం కారణంగా చూసుకోలేక సాండర్స్ తన వ్యాపారాన్ని వేరే సంస్థకు అమ్మేశాడు. మలి వయసులో తనకు ఆసరాగా ఉంటుందని సాండర్స్ కేఎఫ్‌సీని మొదలుపెట్టాడు తప్ప అదిప్పుడు ప్రపంచ వ్యాప్తంగా ఇరవై వేలకు పైగా స్టోర్లకు విస్తరిస్తుందని ఆయన ఊహించలేదు. ఇప్పటికీ సాండర్స్ ఫార్ములాతోనే అక్కడి పదార్థాలు తయారవుతున్నాయి. అందుకే, ఆయన మీదున్న గౌరవంతో సాండర్స్ ముఖాన్నే తమ సంస్థ లోగోగా మార్చేసింది కేఎఫ్‌సీ. ఒక్కోసారి తిరస్కరణ కూడా మేలే చేస్తుందని కేఎఫ్‌సీ విజయం నిరూపిస్తుంది.

# సేవకోసం డాబర్!

సబ్బులూ, షాంపూలూ, తేనె, టూత్‌పేస్ట్, రియల్ ఫ్రూట్ జ్యూస్.. ఇలా భారతీయ సంస్థ డాబర్‌కి చెందిన దాదాపు 250 ఉత్పత్తులు 130 ఏళ్లుగా భారతీయ మార్కెట్లో అందుబాటులో ఉంటున్నాయి. ఓ ఆయుర్వేద వైద్యుడు తప్పని పరిస్థితుల్లో తన ఇంట్లో నెలకొల్పిన చిన్న ఆయుర్వేద మందుల దుకాణం, ఇప్పుడు ప్రపంచ వ్యాప్తంగా అమ్మకాలు సాగిస్తున్న ఆయుర్వేద సంస్థగా ఎదిగింది. 1890ల ప్రాంతంలో దేశవ్యాప్తంగా కలరా, మలేరియా, క్షయ లాంటి వ్యాధులు వందలాది పల్లెల్ని పట్టి పీడించేవి. ఆ సమయంలో ఎస్‌కే బర్మన్ అనే ఓ బెంగాలీ వైద్యుడు తాను సొంతంగా తయారుచేసిన ఆయుర్వేద మందులను ఊరూరా తిరిగి ఉచితంగా పంచేవాడు. కానీ అలా తానొక్కడే ఒక్కో గ్రామానికి తిరిగితే సమయం వృథా అవుతుందనీ, ఇంటి దగ్గరే ఓ దుకాణాన్ని తెరిచి ఔషధాల్ని అందుబాటులోకి తెస్తే, కావల్సిన వాళ్లు అక్కడికే వచ్చి తీసుకెళ్తారనీ బర్మన్ స్నేహితుడు సలహా ఇచ్చాడు. అందరూ అతడిని డాక్టర్ బర్మన్ అని పిలుస్తారు కాబట్టి ఆ పదాల్లోని తొలి అక్షరాల్ని తీసుకొని 'డాబర్' పేరుతో బర్మన్ మందుల దుకాణాన్ని తెరిచాడు. అలా మొదట సేవా దృక్పథంతో బర్మన్ ఔషధాల్ని తయారు చేసి పంచినా, అతడి తరవాతి తరం వాళ్లు మాత్రం ఆ ఫార్ములాతో తయారు చేసిన ఔషధాల్ని దుకాణంలో అమ్మేవారు. బర్మన్ ఔషధాల మహత్యం అప్పటికే బెంగాల్ అంతా విస్తరించింది. దాంతో డబ్బులు పెట్టి కొనడానికీ ఎవరూ వెనకాడేవారు కాదు. అలా నెమ్మదిగా ఆ ఉత్పత్తులు పశ్చిమ బెంగాల్ నుంచి ప్రపంచమంతా విస్తరించాయి. కేవలం సేవా దృక్పథంతో నెలకొల్పిన 'డాబర్' దుకాణం, వేల కోట్ల రూపాయల విలువ కలిగిన సంస్థగా ఎదుగుతుందని బర్మన్ కూడా ఊహించి ఉండడు!




# సబ్బుల నుంచి చూయింగ్‌గమ్‌కి...

క్రికెట్ ఆడుతున్నా, బైక్ నడుపుతున్నా, వేరే ఏ పనిలో ఉన్నా చూయింగ్ గమ్‌ని నమలడం చాలామంది కుర్రాళ్లకి సరదా. ఓ రకంగా ప్రపంచానికి ఆ అలవాటు చేసింది 'రిగ్లీస్' సంస్థే. డబుల్ మింట్, స్పియర్ మింట్, జ్యూసీ ఫ్రూట్, అర్బిట్ అంటూ 125ఏళ్లుగా రకరకాల చూయింగ్ గమ్‌లను దాదాపు అన్ని దేశాల్లో రిగ్లీస్ మార్కెట్లోకి తీసుకొస్తోంది. అంత భారీ సంస్థకు ప్రాణం పోసిన విలియమ్ రిగ్లీ అనే వ్యక్తి నిజానికి ఓ సబ్బుల వ్యాపారి. మొదట్లో వీధుల్లో తిరుగుతూ తాను తయారు చేసిన సబ్బులను ఇంటింటికీ తిరిగి అమ్మేవాడు. వినియోగదార్లను ఆకర్షించేందుకు సబ్బులతో పాటు కాస్త బేకింగ్ పౌడర్‌ని ఉచితంగా ఇచ్చేవాడు. జనాలు తానిచ్చే బేకింగ్ పౌడర్ కోసమే సబ్బులని ఎక్కువగా కొంటున్నారని అతడికి అర్థమైంది. దాంతో సబ్బుల తయారీని ఆపేసి సొంతంగా 'రిగ్లీస్ బేకింగ్ పౌడర్'ని తయారు చేసి అమ్మడం మొదలుపెట్టాడు. ఈసారి ఆ పౌడర్‌ని కొన్నవాళ్లకు తాయిలంగా తానే తయారు చేసిన చిన్న చూయింగ్ గమ్‌ని ఇవ్వసాగాడు. ఆ గమ్ కూడా జనాలకు బాగా నచ్చడంతో, అవసరం లేకపోయినా దాని కోసమే బేకింగ్ పౌడర్‌ని కొనేవారు. దాంతో బేకింగ్ పౌడర్ తయారీని ఆపేసి, 'రిగ్లీస్' పేరుతో అచ్చంగా చూయింగ్ గమ్‌లనే తయారు చేయడం ప్రారంభించాడు. ఆపైన విలియమ్‌కి ఆ వ్యాపారాన్ని ఆపేసే అవసరం రాలేదు. ఓ దశలో తన ఆస్తి మొత్తాన్నీ తాకట్టు పెట్టి, ఆ డబ్బుతో చూయింగ్ గమ్‌కి ప్రచారం కల్పించిన విలియమ్, ప్రపంచ వ్యాప్తంగా ఆ గమ్‌ని నమిలే అలవాటు చేయడంలో కీలకపాత్ర పోషించాడంటారు. అసలుకంటే కొసరు ముద్దని జనాలు అనుకోవడం వల్ల విలియమ్‌కి ఎంత మేలు జరిగిందో కదా!






## ఆ తప్పు వల్లే బోయింగ్!

ఎర్ర బస్సుకీ ఎయిర్ బస్సుకీ ఎంత తేడా ఉంటుందో, సాధారణ విమానాలకీ, బోయింగ్ విమానాలకీ అంతే తేడా ఉంటుంది. ప్రపంచంలోనే శక్తిమంతమైన, విలాసవంతమైన, భారీ విమానాలను బోయింగ్ సంస్థ తయారు చేస్తుంది. అమెరికా, ఇంగ్లండ్ లాంటి ఎన్నో దేశాల అధినేతలకూ, సైన్యానికీ ఆ సంస్థే విమానాలను సమకూరుస్తోంది. అంత భారీ సంస్థ ఏర్పాటుకి మార్టిన్ ఫ్యాక్టరీ అనే మరో విమాన తయారీ సంస్థ చేసిన తప్పిదమే కారణం కావడం విశేషం. 1910 ప్రాంతంలో విలియమ్ బోయింగ్ అనే ఓ సంపన్న వ్యాపారి తొలిసారి ఓ విమానాన్ని గాల్లో ఎగరడం చూశాడు. అప్పట్నుంచీ అతడికి ఒక్కసారైనా విమానంలో ప్రయాణించాలన్న కోరిక కలిగింది. అప్పటికి పౌర విమానయానం అందుబాటులోకి రాలేదు. దాంతో ఐదారేళ్లు కష్టపడి, కొందరు ప్రముఖులతో పరిచయాలు పెంచుకొని, చివరికి ఓ మిలటరీ అధికారి సాయంతో తొలిసారి విమానంలో కాస్త దూరం ప్రయాణించాడు. ఆ దెబ్బతో విమానాలపైన మోజు అతడికి మరింత పెరిగిపోయింది. పైలట్‌గా మారితే హాయిగా రోజూ విమానాల్లో తిరగొచ్చనిపించి, ఆ కోర్సులో చేరి విజయవంతంగా దాన్ని పూర్తిచేశాడు. తరవాత తన ఆస్తిలో కొంత భాగాన్ని అమ్మేసి 'మార్టిన్ ఫ్యాక్టరీ' అనే సంస్థ నుంచి ఓ చిన్న ప్రైవేట్ జెట్ కొనుక్కున్నాడు. వారానికోసారైనా దాంట్లో చక్కర్లు కొడుతూ బోయింగ్ తెగ సంబరపడేవాడు. కానీ ఓసారి అతడి విమానానికి ఇంజిన్‌లో ఏదో సమస్య తలెత్తింది. నెలలు గడిచినా మరమ్మతుకి అవసరమైన విడిభాగాలు సంస్థ నుంచి రాలేదు. అదేంటని ప్రశ్నిస్తే, 'అది ఎడ్లబండి కాదు విమానం, విడిభాగాలు తయారు చేయడం ఏమంత ఆషామాషీ కాదు' అంటూ బదులొచ్చిందట. దాంతో బోయింగ్‌కి విపరీతంగా కోపమొచ్చింది. నిజంగా వాటి తయారీ అంత కష్టమా అన్నది తెలుసుకోవడానికి, బోలెడు డబ్బు ఖర్చు చేసి కొంతమంది ఇంజినీర్ల సాయంతో సొంతంగా అతడే ఆ విడి భాగాలని తయారు చేశాడు. అవి బ్రహ్మాండంగా పనిచేయడంతో తన చెక్క వ్యాపారాన్ని అమ్మేసి ఓ భారీ గ్యారేజీని బోయింగ్ ఏర్పాటు చేశాడు. అక్కడ మొదట విమానాల విడిభాగాలూ, తరవాత ఇంజిన్లూ, ఆ పైన ఏకంగా విమానాలనే తయారు చేయడం మొదలు పెట్టాడు. బోయింగ్ నుంచి పోటీ తట్టుకోలేక, అతడికి విమానాన్ని అమ్మిన మార్టిన్ సంస్థ కొన్నాళ్లకు మూత బడింది. ఆ పైన విమానాల తయారీ రంగంలో ఎదురే లేనట్టుగా బోయింగ్ దూసుకెళ్లింది. ప్రతిభ ఏ ఒక్కరి సొత్తో కాదనడానికి బోయింగ్ ఎదుగుదలే సాక్ష్యం.

## ఇవీ అలానే...

ఎలక్ట్రానిక్స్ రంగంలో పేరున్న సోనీ సంస్థ కూడా అనుకోకుండానే ప్రాణం పోసుకుంది. జపాన్‌లో అకియో మొరిటా, మసురా ఇబుకా అనే ఇద్దరు స్నేహితులు ఒకప్పుడు రేడియోల్ని రిపేర్ చేసే దుకాణం నడిపేవారు. వాళ్ల దగ్గరకు మరమ్మతు కోసం వచ్చే రేడియోల సంఖ్య రోజురోజుకీ పెరగడంతో, త్వరగా పాడవకుండా ఉండే నాణ్యమైన రేడియోని వాళ్లే తయారు చేసి అమ్మకానికి పెట్టారు. సోనీ సంస్థ ఆవిర్భావం ఆ రేడియోలతోనే మొదలైంది.

★ హెడ్ అండ్ షోల్డర్స్, ప్యాంటీన్, ఏరియల్, టైడ్, ఓరల్ బీ, పాంపర్స్, డ్యూరాసెల్.. చాలామందికి ఈ పేర్లతో ఉన్న ఉత్పత్తులు పరిచయమే. 'ప్రాక్టర్ అండ్ గ్యాంబిల్' సంస్థే వీటన్నింటినీ తయారు చేస్తోంది. విలియమ్ ప్రాక్టర్ అనే కొవ్వొత్తుల వ్యాపారీ, జేమ్స్ గ్యాంబిల్ అనే సబ్బుల వ్యాపారీ ఒలివియా, ఎలిజబెత్ అనే ఇద్దరు అక్కచెల్లెళ్లను పెళ్లి చేసుకున్నారు. అల్లుళ్లిద్దరూ తెలివైన వాళ్లే కాబట్టి కలిసి వ్యాపారం చేస్తే బావుంటుందని వాళ్ల మామగారు సలహా ఇవ్వడంతో ఇద్దరి పేరు మీదా 'పీఅండ్‌జీ' అనే వ్యాపార సామ్రాజ్యం వెలిసింది.

★ హోండా సంస్థ వ్యవస్థాపకుడు సోయిచిరో హోండా ఓ సాధారణ కార్ల మెకానిక్. ఒకప్పుడు టొయోటా సంస్థకు చెందిన కార్లకు మరమ్మతు చేసేవాడు. కార్లలానే తన సైకిల్ కూడా దానంతటదే ప్రయాణిస్తే బావుంటుందని అనిపించి దానికి ఓ చిన్న ఇంజిన్‌ని అమర్చాడు. అది బాగా పనిచేయడంతో, బైకుల తయారీకి పెట్టుబడి పెడతామని కొంతమంది ముందుకొచ్చారు. అలా ఓ మామూలు మెకానిక్ హోండా అధినేతగా మారాడు.

ఓసారి ఓ రాజుగారు తన రాజ్యంలో ప్రజల మనస్తత్వం ఎలా ఉందో తెలుసుకోవడానికి రాత్రి పూట రోడ్డు మధ్యలో ఓ పెద్ద బండరాయిని పెట్టించాడు. తెల్లవారాక ఎవరైనా దాన్ని తొలగిస్తారేమో చూద్దామని ఆ రాజు మారు వేషంలో రోడ్డు పక్కనే నిలబడ్డాడు. చాలామంది ఆ రాయిని చూసీ చూడనట్టు పక్కనుంచి వెళ్లిపోయారు. ఇంకొందరైతే, రాజుగారికి రోడ్లని శుభ్రం చేయించడం కూడా తెలీదు అంటూ తిట్టుకుంటూ ముందుకు నడిచారు. ఒక వ్యక్తి మాత్రం తన చేతిలో బరువైన మూటలున్నా, వాటిని పక్కనబెట్టి ఆ రాయిని అతికష్టమ్మీద దారిలోంచి తొలగించాడు. వెనక్కి తిరిగి చూసేసరికి ఆ రాయి ఉన్న స్థలంలో ఓ చిన్న సంచీ కనిపించింది. 'ఈ రాయిని తొలగించిన వాళ్లకి ఇందులో ఉన్న బంగారం దక్కుతుంది' అంటూ అందులో ఓ చీటీ రాసుంది. 'బోయింగ్' అధినేత విలియమ్, లాంబోర్గిని వ్యవస్థాపకుడు ఫెరూషియో, 'కేఎఫ్‌సీ' సృష్టికర్త శాండర్స్ లాంటి వాళ్లందరికీ అవమానాలూ, సమస్యలూ, సంక్లిష్ట పరిస్థితుల రూపంలో ఇలాంటి పెద్ద పెద్ద బండరాళ్లు ఎదురయ్యాయి. వాళ్లంతా వాటిని దాటుకుపోకుండా, తొలగించుకొని ముందుకెళ్లారు. 'బంగారం' లాంటి జీవితాన్ని అందుకున్నారు. రాజుగారి కథా, వీళ్లందరి గాథా చెప్పే దొక్కటే... జీవితంలో మంచిమంచి అవకాశాలన్నీ చాలాసార్లు కష్టాలూ సమస్యల రూపంలోనే వస్తాయి. వాటిని చూసీ చూడనట్టు వదిలేసేవాళ్లు అలాగే మిగిలిపోతారు. తొలగించుకొని ముందుకెళ్లేవాళ్లు విజేతలై చరిత్ర సృష్టిస్తారు!



# బతికేందుకు ఒక్క అవకాశమిద్దాం!



**చెట్లు మనకు నీడనిస్తాయి, ప్రాణవాయువును అందిస్తాయి. ఇంకా పండ్లూ, కాయల్నీ పంచుతాయి, కాలుష్యాన్ని తగ్గిస్తాయి. మరి, చెట్లను మనమేం చేస్తున్నాం... రోడ్లు, వంతెనలు, భవనాల నిర్మాణాల సమయంలో నిర్దాక్షిణ్యంగా నరికేస్తున్నాం. 'బతికినంత కాలం మనకు ఎన్నో విధాల మేలు చేకూర్చే చెట్లకు బతికేందుకు ఒక్క అవకాశం ఇద్దాం' అంటున్నారు 'వట ఫౌండేషన్' నిర్వాహకులు.**

వట... పేరులోనే వృక్షం ఉన్న ఈ సంస్థ చెట్లను కాపాడే లక్ష్యంతో ఏర్పడింది. దీన్ని హైదరాబాద్‌కు చెందిన పెద్దిరెడ్డి ఉదయ్‌కృష్ణ స్థాపించారు. 'అభివృద్ధి పనులు చేపట్టేటపుడు చెట్లు అడ్డుంటే వాటిని ఎందుకు పరిరక్షించలేం?' అన్న ప్రశ్న ఉదయ్‌కృష్ణలో ఉదయించింది. చెట్లను తిరిగి నాటడమే అందుకు సరైన మార్గంగా అతడికి కనిపించింది. దానికోసమే 'వట' ఫౌండేషన్‌ను స్థాపించారు. ఆ ఆలోచనకు జ్యోతి కొండా, సుస్మితారెడ్డిల సహకారం అందుతోంది.

## వృక్షాల తరలింపు

కేపీహెచ్‌బీలో ఆరేళ్ల కిందట కాలిబాట వంతెన నిర్మించే సమయంలో చెట్లను తొలగించేందుకు అధికారులు సిద్ధమయ్యారు. దశాబ్దాలుగా ఆ మార్గంలో ప్రాణవాయువును పెంచుతూ, నీడను ప్రసాదిస్తున్న 16 భారీ వృక్షాలను నరికేస్తున్నారన్న సంగతి ఉదయ్ దృష్టికి వచ్చింది. వాటిని వేరేచోట నాటేందుకు అవకాశమివ్వాలని అధికారులని అడగ్గా పనులకు ఆలస్యమవుతుందని తొలుత ఒప్పుకోలేదు. చివరకు ఉన్నతాధికారులకు విషయాన్ని వివరించి అనుమతి తీసుకున్నారు. ఆ 16 చెట్లను కేపీహెచ్‌బీలోని ఖాళీ ప్రదేశానికి తరలించి నాటగా అందులో 13చెట్లు పునర్జీవం పోసుకున్నాయి. ఆ తర్వాత హైటెక్‌సిటీలోని బొటానికల్ గార్డెన్ రోడ్డు విస్తరణ పనులు జరిగినపుడు ఏకంగా 198 చెట్లను కొట్టేయాలని నిర్ణయించారు. దీనికి వ్యతిరేకంగా 'వట ఫౌండేషన్' ఉద్యమించింది. చెట్లను వేరొకచోటికి తీసుకెళ్లి నాటుతామని అధికారులకు చెప్పినా, దానివల్ల పనులు సకాలంలో పూర్తిచేయలేమని అనుమతులు నిరాకరించారు. దాంతో ఫౌండేషన్ సభ్యులు న్యాయస్థానాన్ని ఆశ్రయించి చెట్ల ట్రాన్స్‌లొకేషన్‌కు అనుమతి తెచ్చుకున్నారు. ఆలోపే అధికారులు చాలావరకూ చెట్లపై గొడ్డలి వేటు వేశారు. చివరికి మిగిలిన 45 చెట్లను ఫౌండేషన్ కాపాడగలిగింది.

హైదరాబాద్‌లో 'స్ట్రాటజిక్ రోడ్ డెవలప్‌మెంట్ ప్లాన్'లో భాగంగా కేపీహెచ్‌బీ-జేఎన్‌టీయూ వద్ద ఓవర్ బ్రిడ్జి నిర్మాణం చేపడుతున్నారు. దీనికోసం 108 చెట్లను కొట్టాల్సి వస్తుందని గుర్తించారు. ఈ విషయం వట ఫౌండేషన్‌కు తెలిసి వాటిని తిరిగి నాటడానికి ముందుకు వచ్చింది. కొన్ని చెట్లు చిన్నగా ఉండటంతోపాటు వాటిని తరలించినా బతికే అవకాశం ఉండదని వాటిని విడిచిపెట్టి 72 చెట్లను మాత్రం కేపీహెచ్‌బీ నుంచి 12కి.మీ. దూరంలోని మణికొండకు తరలించి నాటారు. రెడ్డీస్ ల్యాబ్స్, శ్రీనివాస హ్యాచరీస్ ఈ కార్యక్రమానికి ఆర్థిక చేయూతనిచ్చాయి. వీటిలో 60 చెట్లకు చిగుళ్లు వేశాయి. ఈ చెట్లతో మణికొండకు పచ్చదనం వస్తోందన్న ఆలోచనతో స్థానికులూ, ప్రజాప్రతినిధులూ పూర్తిగా సాయపడ్డారు. 'ధృవన్ష్ ఫౌండేషన్' ఈ చెట్ల సంరక్షణను చేపడుతోంది. ఇటీవల నగరంలోని శ్రీనగర్‌కాలనీలోని యాభై ఏళ్లనాటి రావిచెట్టుని తొలగిస్తుంటే కూడా ఇదే విధంగా తరలించి బతికించారు.

## పులుల కోసం మొదలై...

'వట' సంస్థ ఏర్పాటు 2013లో జరిగినా.. పర్యావరణ పరిరక్షణకు బీజం మాత్రం 2010లోనే పడింది. మహారాష్ట్ర-తెలంగాణ సరిహద్దులో 'తిప్పేశ్వర్' అటవీ ప్రాంతం ఉంది. ఇక్కడ పులులు బాగా సంచరిస్తుంటాయి. ఈ ప్రాంతంలో ఎక్కువగా ఉండే టేకు చెట్లని స్థానికులు నరికేస్తుండటంతో పులుల సంచారానికి ఆటంకం ఏర్పడేది. దీన్ని పులులు తిరిగేందుకు అనుకూలంగా మార్చాలంటే అక్కడ మిగతా చెట్లనీ పెంచాలని అయిదు వేల మర్రి మొక్కలతోపాటు చింత, వేప, వెలగ, రావి, నేరేడు వంటి మొక్కలను అటవీ శాఖ సహాయంతో నాటించింది వట. ఇవి పెరిగి పెద్దవయ్యాయి. పులుల సంచారానికి ఇబ్బంది తగ్గింది. తిప్పేశ్వర్‌కి దగ్గర్లోనే కవ్వాల్ అటవీ ప్రాంతం ఉంది. దీని విస్తీర్ణం ఎక్కువ. ఈ రెండింటి మధ్య లింకు కారిడార్ ఏర్పాటు చేసి చెట్లు పెంచేందుకు కృషి జరుగుతోంది. ఫౌండేషన్ తరపున అటవీశాఖకు డ్రోన్ కెమెరాను అందించారు. గాయపడిన పులుల్ని తెలుసుకునేలా ఇది ఉపకరిస్తుంది.

'నాకు చిన్నప్పట్నుంచీ చెట్లపైన చెప్పలేనంత ప్రేమ. చెట్లు నరికేస్తున్నారంటే చాలా బాధగా అనిపించేది. అందుకే చెట్లను పరిరక్షించే కార్యక్రమాన్ని ప్రారంభించాను. చెట్లను ట్రాన్స్‌లోకేషన్ చేసేందుకు మాకు దొరికే సమయం చాలా తక్కువ. నాలుగైదు రోజుల వ్యవధిలోనే చెట్లను తరలించాలనీ, లేకపోతే పనులకు ఆటంకం కలుగుతుందనీ అధికారులు చెబుతుంటారు. ఏదేమైనా చెట్లను బతికించాలని ఆ కాస్త వ్యవధిలోనే యంత్రాలనీ, మానవ వనరుల్నీ సమకూర్చుకుని చెట్లను తరలిస్తున్నాం. ఆర్థికంగా ఇబ్బంది అయినా కూడా పచ్చదనాన్ని కాపాడాలనే తపనతో వ్యయప్రయాసలకు ఓర్చి ఈ పని చేస్తున్నాం' అని చెబుతారు ఉదయ్‌కృష్ణ(ఫోన్:98480 23029).

మొక్కలు నాటడమే కాదు, చెట్లని కాపాడటమూ మన బాధ్యతే!

– **వై.వి.వి.అమరేంద్ర,** *హైదరాబాద్ సిటీ డెస్క్*







# ఆట మళ్లీ మొదలైంది!

**ఆటగాడు, వ్యాఖ్యాత, మేనేజర్, డైరెక్టర్, కోచ్... క్రికెట్‌కు సంబంధించి ఇన్ని రకాల బాధ్యతల్ని మరెవరూ నిర్వర్తించి ఉండరేమో! దీన్నిబట్టి అతడు క్రికెటర్ మాత్రమే కాదు, క్రికెట్ ప్రేమికుడని అర్థమవుతోంది కదా. ఆ క్రికెట్ ప్రేమికుడు మరెవరో కాదు, భారతజట్టు హెడ్ కోచ్ రవిశాస్త్రి. క్రికెట్‌తో అతడి ప్రస్థానమిది...**

రవి తండ్రి డాక్టర్, తల్లి హిస్టరీ ప్రొఫెసర్. కర్ణాటక నుంచి వెళ్లి ముంబయిలో స్థిరపడిన కుటుంబం వీరిది. రవి పుట్టి పెరిగింది ముంబయిలోనే. తన బాల్యం చాలా అద్భుతంగా గడిచిందంటాడు రవి. 'ఏ విషయంలోనూ అమ్మానాన్న నామీద ఒత్తిడి పెట్టలేదు. నన్ను ఏదో గొప్పవాణ్ని చేసేయాలని వారెప్పుడూ అనుకోలేదు. నా ఇష్టాన్ని గమనించి క్రీడలవైపు ప్రోత్సహించారు. నేను వారి సలహాల్ని పాటించేవాణ్ని. కానీ, అంతిమంగా నాకు నచ్చిందే చేసేవాణ్ని' అని తన బాల్యాన్ని గుర్తుచేసుకుంటాడు రవి.

### అండర్-19 కెప్టెన్

రవి చదివిన డాన్ బాస్కో స్కూల్లో బీపీ దేశాయ్ క్రికెట్ కోచ్. రవిని క్రికెట్‌వైపు ప్రోత్సహించింది ఆయనే. ఆ స్కూల్ క్రికెట్ జట్టుకు నాయకత్వం వహించిన రవి, డిగ్రీ రెండో సంవత్సరంలో ఉండగానే ముంబయి రంజీ జట్టులో స్థానం సంపాదించాడు. అప్పటికి ఆ జట్టులో గవాస్కర్, వెంగ్‌సర్కార్, సందీప్ పాటిల్ లాంటి హేమాహేమీలు ఆడుతున్నారు. రవి అంతకు ముందే అండర్-19 జట్టుకి ఎంపికయ్యాడు. ఆ జట్టుకి నాయకత్వం వహించాడు కూడా. రవి కెప్టెన్సీలో భారత జట్టు ఇంగ్లాండ్, జింబాబ్వే పర్యటనలకు వెళ్లింది. '1979-80 సీజన్లో శ్రీలంకతో నా మొదటి అండర్-19 మ్యాచ్ ఆడాను. జట్టులోనే, కాదు ప్రత్యర్థి జట్టు ఆటగాళ్ల మధ్యా స్నేహపూర్వక వాతావరణం ఉండేది. ఆ పర్యటనలో లంక ఆటగాడు రణతుంగ కూడా ఆడాడు. జింబాబ్వే, ఇంగ్లాండ్ పర్యటనల్నీ బాగా ఎంజాయ్ చేశా' అంటాడు రవి.

### సెక్యూరిటీ గార్డ్ చెప్పాడు...

1981 మార్చిలో టీమ్ ఇండియాకు ఎంపికయ్యాడు రవి. నిజానికి జట్టులోకి ఎంపికైన సంగతి హోటల్ సెక్యూరిటీ గార్డు చెబితేగానీ రవికి తెలియలేదట. 'కాన్పూర్‌లో రంజీ మ్యాచ్ ఆడుతున్నాను. ఆ మ్యాచ్‌లో నా బ్యాటింగ్ ప్రదర్శన పేలవంగా ఉంది. రెండు ఇన్నింగ్స్‌లోనూ డకౌట్ అయ్యాను. మర్నాడు ఉదయం పేపర్ కొనడానికని బయటకు వెళ్లాను. అక్కడ సెక్యూరిటీ గార్డ్ నాకు శుభాకాంక్షలు చెబుతున్నాడు. ఎందుకని అడిగితే భారతజట్టులోకి నన్ను తీసుకున్నట్టు రేడియోలో విన్నానని చెప్పాడు. ఆ వార్త అతడి ద్వారానే నాకు మొదట తెలిసింది. న్యూజిలాండ్ పర్యటనలో ఉన్న జట్టు నుంచి గాయం కారణంగా దిలీప్ దోషీ వైదొలగడంతో అతడి స్థానంలో నన్ను ఎంపికచేశారు. మర్నాడు సాయంత్రానికి వెల్లింగ్‌టన్‌లో ఉన్నాను' అని ఆ రోజుల్ని గుర్తుచేసుకుంటాడురవి. గవాస్కర్ అప్పుడు కెప్టెన్. బౌలర్‌గా జట్టులోకి వచ్చిన రవి... మొదటి మ్యాచ్‌లోనే ఆరు వికెట్లు తీశాడు. రెండో ఇన్నింగ్స్‌లో నాలుగు వరుస బంతుల్లో మూడు వికెట్లు తీయడంతోపాటు, మొదటి ఇన్నింగ్స్‌లోనూ మూడు వికెట్లు తీశాడు. 'ఆ సిరీస్‌లో మొత్తం 15 వికెట్లు తీశాను. విదేశాల్లో ఓ స్పిన్నర్ వికెట్లు తీయడం చాలా కష్టం. ఆ శుభారంభం నాలో ఆత్మవిశ్వాసాన్ని నింపింది' అంటాడు. కెరీర్ తొలి మ్యాచ్‌లో పదో నంబర్ బ్యాట్స్‌మన్‌గా బరిలోకి దిగిన రవి, ఏడాది తర్వాత మొదటిసారి ఓపెనర్ అయ్యాడు. ఇంగ్లాండ్‌పైన 1982 జులైలో ఓపెనింగ్ బ్యాట్స్‌మన్‌గా దిగాడు. తర్వాత పాకిస్థాన్‌తో ఓ మ్యాచ్‌లో ఓపెనర్‌గా వెళ్లి ఇమ్రాన్‌ఖాన్, సర్ఫరాజ్ నవాజ్ లాంటి మేటి బౌలర్లని సమర్థంగా ఎదుర్కొని సెంచరీ చేశాడు. 'నేను రూమ్‌లో మరో ఆటగాడితో కలిసి బీరు తాగుతున్నా. కెప్టెన్ గవాస్కర్ వచ్చి 'రేపటి మ్యాచ్‌లో నువ్వు ఓపెనింగ్ చెయ్యాలి' అన్నాడు. 'తప్పకుండా' అన్నాను. మొదట్నుంచీ బ్యాట్స్‌మన్‌గా ఎలాంటి సవాలునైనా స్వీకరించడానికి నేను సిద్ధంగా ఉండేవాణ్ని. 'నైట్‌వాచ్‌మెన్'గా పంపమని కెప్టెన్‌ని అడిగేవాణ్ని. ఆ అయిదు, పదినిమిషాలు నిలబడితే మర్నాడు మంచి స్కోర్ చేసేందుకు అవకాశం ఉంటుందని నా ఆలోచన' అని చెబుతాడు రవి. 1983 ప్రపంచకప్ గెల్చిన భారతజట్టులో రవి కీలక ఆటగాడు. 1984-85 సీజన్లో అయితే అటు బంతితో, ఇటు బ్యాట్‌తో అంతర్జాతీయ మ్యాచ్‌లలో మెరుపులు మెరిపించాడు. ఆ సీజన్లో ఆస్ట్రేలియా పర్యటనలో ఛాంపియన్ ఆఫ్ ది ఛాంపియన్స్(మ్యాన్ ఆఫ్ ద సిరీస్)గా 'ఆడి' కారు గెల్చుకున్నాడు.

### ఓవర్లో ఆరు సిక్సులు

ఒక ఓవర్లో ఆరు సిక్సర్లు కొట్టిన అరుదైన రికార్డుని రవిశాస్త్రి 1985లో బరోడాతో జరిగిన ఓ రంజీ మ్యాచ్‌లో సాధించాడు. అప్పటికి ఫస్ట్‌క్లాస్ క్రికెట్‌లో రవికంటే ముందు గ్యారీ సోబర్స్‌కి మాత్రమే ఆరు బంతుల్లో ఆరు సిక్సర్లు కొట్టిన రికార్డు ఉంది. బరోడా స్పిన్నర్ తిలక్ రాజ్ ఓవర్లో రవి ఈ రికార్డుని సమం చేశాడు. ఆ మ్యాచ్‌లో 123 బంతుల్లో డబుల్ సెంచరీ చేసి ఫస్ట్‌క్లాస్ క్రికెట్‌లోనే అత్యంత వేగవంతమైన డబుల్ సెంచరీ రికార్డునీ నెలకొల్పాడు రవి. 30 ఏళ్ల తర్వాత గతేడాదే ఇంగ్లాండ్ ఆటగాడు అన్యూరిన్ డొనాల్డ్ ఈ

రికార్డుని సమం చేయగలిగాడు.

### *30 ఏళ్లకే రిటైర్మెంట్*

ముంబయి రంజీ జట్టు కెప్టెన్‌గా దిలీప్ వెంగ్‌సర్కార్, గవాస్కర్, సందీప్ పాటిల్, అన్షుమన్ గైక్వాడ్‌లకు కెప్టెన్సీ చేశాడు రవి. అదీ పాతికేళ్ల వయసులో. తర్వాత 1987-88 సీజన్లో విండీస్‌తో జరిగిన చెన్నై టెస్టులో భారత్‌కు నాయకత్వం వహించి జట్టుని గెలిపించాడు. 1992లో ఆస్ట్రేలియాపైన వారి గడ్డమీదే రెండు సెంచరీలు చేసిన రవి కెరీర్‌లో పైపైకి వెళ్తున్న దశలో మోకాలి గాయం కారణంగా జట్టుకి దూరమయ్యాడు. తర్వాత కొన్ని నెలలకు దక్షిణాఫ్రికా పర్యటనకు ఎంపికయ్యాడు. కానీ మళ్లీ గాయం తిరగబెట్టడంతో జాతీయ జట్టుకి దూరమయ్యాడు. 1992 డిసెంబరులో ఆఖరి అంతర్జాతీయ మ్యాచ్ ఆడాడు. 'నేను అప్పటికి కెరీర్‌లో ఉన్నత దశలో ఉన్నాననే చెప్పాలి. గాయాలు కాకుంటే మరో నాలుగైదేళ్లు ఆడే వాణ్ని. నా బ్యాట్ నుంచి ఇంకెన్నో అద్భుతమైన ఇన్నింగ్స్ వచ్చేవి. కానీ మోకాలికి వరుసగా రెండు తీవ్రమైన గాయాలయ్యాయి. అవి దీర్ఘకాల సమస్యగా మారాయి. పూర్తి ఫిట్‌నెస్‌తో ఆడలేనని అర్థమైంది. దాంతో ఇష్టంలేకపోయినా ఆటకు దూరంగా ఉండాల్సి వచ్చింది' అంటాడు రవి. సిడ్నీలో ఆస్ట్రేలియాపైన చేసిన డబుల్ సెంచరీ కంటే వెస్టిండీస్‌పైన బార్బడోస్‌లో చేసిన సెంచరీ తన కెరీర్‌లోనే అత్యుత్తమమైన ఇన్నింగ్స్ అని చెబుతాడు. భారత్ ఆ మ్యాచ్‌లో ఓడిపోయింది. ప్రధాన బ్యాట్స్‌మెన్ ఒక్కొక్కరూ పెవిలియన్‌కు వస్తున్నా మాల్కమ్ మార్షల్, ఇయాన్ బిషప్, వాల్ష్, అంబ్రోస్‌లకు ఎదురు నిలిచి సెంచరీ(107) చేశాడు రవి.

### *వ్యాఖ్యాతగా కెరీర్*

1993 ద్వితీయార్థంలో మళ్లీ మైదానంలోకి అడుగుపెట్టాడు రవి. ఈసారి అతడి కెప్టెన్సీలో ముంబయి జట్టు 1994 రంజీ ట్రోఫీని గెలిచింది. ఓ పక్క మోకాలి గాయం బాగా ఇబ్బంది పెడుతున్నా తనలోని క్రికెటర్‌ని కొన్నాళ్లు దేశవాళీ మ్యాచ్‌లలో అయినా కొనసాగించాలనుకున్నాడు. ఆ సమయంలో 'వ్యాఖ్యానం చెబుతారా' అంటూ ఓ టీవీ ఛానెల్ నుంచి పిలుపొస్తే... ప్రయత్నిద్దామనుకున్నాడు. వ్యాఖ్యాతగా వెళ్లొచ్చాక అదే ఏడాది క్రికెట్‌కు రిటైర్మెంట్ ప్రకటించాడు. దానికి బోర్డులో చాలామంది ఆశ్చర్యపోయారు. ఎందుకంటే కొన్ని నెలల కిందటే రంజీ ట్రోఫీ గెలిపించాడు. 'కానీ నేను వ్యాఖ్యానాన్ని సీరియస్‌గా తీసుకోవాలనుకున్నాను. మొదటిరోజునుంచే నాకది సరైన వేదిక అనిపించింది' అని చెబుతాడు రవి. అలా 11 ఏళ్ల అంతర్జాతీయ కెరీర్‌కు అధికారిక ముగింపు పలికాడు. 'క్రికెటర్‌గా కెరీర్ ప్రారంభంలో బీబీసీ, ఏబీసీ రేడియోలలో క్రికెట్ వ్యాఖ్యానం వినేవాణ్ని. అది నాకు బాగా ఉపయోగపడింది. క్రికెటర్, క్రికెట్ వ్యాఖ్యానం రెంటిలోనూ క్రమశిక్షణ అవసరం. రెంటిలోనూ ఆటపైన వంద శాతం దృష్టి పెట్టాల్సి ఉంటుంది. చాలా లోతుగా తెలుసుకోవాల్సి ఉంటుంది. వ్యాఖ్యానం ఆటకు దూరం కాకుండా నాకు దక్కిన అవకాశం అనిపించి అటువైపు వెళ్లాను' అంటాడు. వ్యాఖ్యాతగా ఏటా 150 రోజులపాటు లైవ్‌లో, 300 రోజులు ప్రయాణాల్లో ఉంటానంటాడు రవి. ఇండియా ఆడిన మ్యాచ్‌లకే కాకుండా ఆస్ట్రేలియా-ఇంగ్లాండ్, ఆస్ట్రేలియా-దక్షిణాఫ్రికా సిరీస్‌లకూ వ్యాఖ్యానం చేశాడు.

### *జట్టుతో మూడోసారి*

2007 ప్రపంచకప్‌లో మొదటి దశలోనే బంగ్లాదేశ్‌తో ఓడి బయటకు వచ్చింది భారత జట్టు. అభిమానుల్లో ఆవేశం, ఆటగాళ్లలో నైరాశ్యం. ఆ దశలో మన క్రికెటర్లలో ఆత్మస్థైర్యాన్ని నింపడానికి మేనేజర్‌గా రమ్మంటూ రవిని బీసీసీఐ పిలిస్తే వెంటనే ముందుకొచ్చాడు. 2014లో వరుస ఓటములతో సతమతమవుతోంది టీమ్ ఇండియా. కోచ్ డంకన్ ఫ్లెచర్ సహా సహాయ సిబ్బంది నిస్సహాయులైన వేళ టీమ్ డైరెక్టర్‌గా ఉండమంటూ మరోసారి పిలుపు. ఈసారి జట్టుతో కలిసి వారిలో నూతనోత్తేజాన్ని తెచ్చాడు. 2017... నాటకీయ పరిణామాల



మధ్య హెడ్ కోచ్ కుంబ్లే నిష్క్రమణ. ఈసారి హెడ్‌కోచ్‌గా బాధ్యతలు తీసుకోవాలని రవికి ఆహ్వానం. నిజానికి గతేడాది తనను కోచ్‌గా ఎంపికచేయకపోవడంతో నిరాశ చెందానని రవి బహిరంగంగానే చెప్పాడు. కానీ, క్రికెట్ సలహా సంఘం పిలిచినపుడు అవన్నీ ఆలోచించకుండా ముందుకు వచ్చాడు. 'జట్టుతో కలిసి కొన్నాళ్లు మంచి క్రికెట్ జర్నీ చేశాను. ఆ సమయంలో మన టీమ్ టెస్టుల్లో నంబర్ వన్ అయింది. మరోసారి బాధ్యత నాపైన ఉంది అనిపించింది' అంటాడు రవి. 'జట్టుకి కెప్టెనే అసలైన సారథి. కెప్టెన్ తర్వాతే కోచ్' అని అభిప్రాయపడతాడు రవి. ఆటగాళ్లలో ఒకడిలా కలిసి పనిచేసే నైజమతడిది.

### *కెప్టెన్సీ అందుకే రాలేదు*

'వర్క్ హార్డ్, పార్టీ హార్డర్' అనే స్వభావం రవిది. 'నైట్‌క్లబ్‌లూ, బార్లకి ఎంతగా వెళ్లేవాడినో, మ్యాచ్‌ల సందర్భంగా అంతే కఠినంగా శ్రమించేవాణ్ని. నాకున్న క్రేజ్‌ని ఎప్పుడూ ఇబ్బందిగా భావించలేదు. ఆ సమయాన్ని ఎంతో ఆస్వాదించా' అంటాడు. 'వంద పరుగులు చేసినా సున్నాకే ఔటయినా మైదానం వరకే ఆ ఫీలింగ్. తర్వాత రూమ్‌లో ఉండటం నాకు నచ్చదు. ఏ దేశం వెళ్లినా అక్కడ ఎంజాయ్ చేసేవాణ్ని' అంటాడు. ఈడెన్ గార్డెన్స్ కామెంటరీ బాక్స్‌లో ఏసీ లేకపోతే. 'ప్రపంచంలోనే చెత్త కామెంటరీ బాక్స్'అని ఆ విషయాన్ని లైవ్‌లోనే చెప్పాడు. 'నేను మొదట్లో అందరిలానే ఉండేవాణ్ని. కొత్త మనుషుల్ని చూడటం, కొత్త సంస్కృతుల్ని తెలుసుకోవడం లాంటివి నన్ను మార్చాయి. జీవితంలో ఆనందాన్ని భాగం చేసుకున్నాను. ఏదైనా దక్కాల్సింది దక్కకపోతే, నేను ప్రశ్నించేవాణ్ని' అని చెబుతాడు. ఈ స్వభావంవల్లనే తనకు టీమ్ ఇండియా కెప్టెన్సీ రాకపోయుంటుందని అభిప్రాయపడతాడు. ★

### ఇంకొంత

**పూర్తిపేరు** రవిశంకర్ జయద్రిత శాస్త్రి. తల్లిదండ్రులది మంగళూరు దగ్గర కర్వార్. రవికి కన్నడం బాగా అర్థమవుతుంది కానీ మాట్లాడటం కొద్దిగానే వస్తుంది.

★ జీవితంలో ఏకైక హీరో తన తండ్రి అనీ, తొమ్మిదేళ్ల కిందట ఆయన చనిపోయినపుడు ఎంతో కుంగిపోయాననీ చెబుతాడు.

★ భార్య రీతూ. 1990లో వీరికి పెళ్లయింది. పెళ్లయిన 18ఏళ్లకి ఓ పాప పుట్టింది. పేరు అలేక. ఏడేళ్లనుంచే అలేక కామెంటరీ చెప్పడం మొదలుపెట్టిందట.

★ ధోనీ హెలికాప్టర్ షాట్‌లా అప్పట్లో రవిశాస్త్రి చపాతి షాట్ ప్రఖ్యాతి.

★ ఖాళీ దొరికితే గోల్ఫ్ ఆడతాడు. సొంతూరులోని విష్ణుమూర్తి ఆలయాన్నీ, తిరుపతి, గురువాయూర్ లాంటి పుణ్యక్షేత్రాలనూ దర్శిస్తుంటాడు.

★ లెఫ్టార్మ్ స్పిన్నర్, రైట్ ఆర్మ్ బ్యాట్స్‌మన్.

★ 80 టెస్టుల్లో 3830 పరుగులు చేసి, 151 వికెట్లు తీశాడు.

★ 150 వన్డేల్లో 3108 పరుగులు చేసి, 129 వికెట్లు తీశాడు.

# ఇంటర్నెట్ @వన్ మినిట్!

చేతిలో ఫోనూ... ఫోనులో మొబైల్ డేటా, ఇంట్లో ల్యాప్‌టాపూ... దానికో ఇంటర్నెట్ కనెక్షనూ ఈ తరానికి తప్పనిసరి. ఒక్క ఈ తరమనేముంది? ఐదేళ్ల బుజ్జిగాడి నుంచి అరవయ్యేళ్ల అమ్మమ్మ వరకూ నెట్ లేకపోతే పూట గడవడం లేదు. ఇంకా బడి మొహం చూడని బుడ్డోడికి కూడా రైమ్స్ వీడియోలు కావాలి. ఇక అమెరికాలోనో ఆస్ట్రేలియాలోనో ఉన్న మనవడినో మనవరాలినో వీడియో కాల్‌లో చూసుకోడానికి బామ్మకు వాట్సాప్ కావాలి.

## ఒక్క నిమిషం...

ఒక్క నిమిషం... అన్నది మనలో చాలామందికి ఊతపదం. కానీ ఆ ఒక్క నిమిషంలో అంతర్జాలంలో ఏం జరుగుతుందో తెలుసా?




**పొ**ద్దున్నే లేచి ఇన్‌స్టాగ్రామ్‌లో ఓ సెల్ఫీ పోస్ట్ చేయకుండా కాలేజీకి వెళ్లదు టీనేజీ అమ్మాయి. వాకిట్లో పూసిన తెల్లగులాబీని ఒక్క క్లిక్‌తో క్యాప్చర్ చేసి ఆఫీసుకెళ్లగానే ఫేస్‌బుక్ మిత్రబృందానికి దాంతో గుడ్‌మార్నింగ్ చెప్పేస్తే ఓ పనైపోతుందనుకుంటుంది ఇల్లాలు.

ఇక మాస్టారు ఆ ఫోన్‌ని క్షణం వదిలితే ఒట్టు... స్కైప్‌లో ఆఫీసు క్లయింట్లతో మొదలుపెట్టి ఆన్‌లైన్ షాపింగ్ వరకూ మల్టిపుల్ ఆప్‌లతో మల్టి టాస్కింగ్ చేసేస్తుంటారు. అత్యంత వేగంగా అభివృద్ధి సాధిస్తున్నదేదన్నా ఉందీ అంటే ఈ కాలంలో అది అంతర్జాలమే! ఒకప్పుడు ఏదైనా సమాచారం కోసం, ఈమెయిల్ పంపడం కోసం మాత్రమే అంతర్జాలం మీద ఆధారపడేవాళ్లం. అలాంటిది ఒక్కసారిగా సామాజిక మాధ్యమాలు అంతర్జాలాన్ని ముంచెత్తడంతో మోస్ట్ హ్యాపెనింగ్ ప్లేస్ ఇప్పుడు అదే అయిపోయింది. ఇంటిల్లిపాదీ తమదైన పద్ధతిలో దాన్ని వినియోగించుకుంటున్న తీరే అందుకు నిదర్శనం.

### వామ్మో... నాలుగు కోట్లా!

అవును... ఆన్‌లైన్ షాపింగ్‌లో ఒకే ఒక్క నిమిషంలో అక్షరాలా 4 కోట్ల 83 లక్షల రూపాయల పైనే ఖర్చుపెట్టేస్తున్నారు! మూడేళ్ల క్రితం అమెజాన్ సైట్ ఓ రోజు 49 నిమిషాల పాటు పనిచేయలేదు. అందుకు కంపెనీ దాదాపు 31 కోట్ల రూపాయల అమ్మకాలు కోల్పోయింది. గూగుల్‌లో మనం ఒకే ఒక్క ప్రశ్న అడిగితే కనీసం వెయ్యి కంప్యూటర్లు దాని మీద పనిచేసి 0.2 సెకన్లలో మనకు సమాధానం వచ్చేలా చేస్తాయి. ఫేస్‌బుక్ స్టేటస్‌లో మనం ఏమన్నా రాద్దామని టైప్ చేస్తామా... దాన్ని పోస్ట్ అని కొట్టేవరకూ అది మనకు తప్ప ఇంకెవరికీ కన్పించదనుకుంటాం. కానీ పోస్ట్ బటన్ నొక్కకపోయినా మనం టైప్ చేసిందంతా ఫేస్‌బుక్ సర్వర్లకు వెళ్లిపోతుంది. అదీ అంతర్జాలం మహిమ.

అంతర్జాలం ప్రజల్లోకి అత్యంత వేగంగా చొచ్చుకుపోతున్న దేశాల్లో మనం చైనా తర్వాత రెండో స్థానంలో ఉన్నాం. దీని విస్తృతికి ఒక్క సామాజిక మాధ్యమాలే కారణం కాదు. ఈరోజుల్లో చదువు, ఉద్యోగావకాశాలు, సేవలూ వస్తు ఉత్పత్తులకు సంబంధించిన సమస్త సమాచారం... అంతర్జాలంలోనే లభ్యమవుతోంది. పైగా సమయం, ఖర్చూ కలిసి వస్తాయి. అటువంటప్పుడు దాన్ని ఎంతగా వినియోగించుకుంటే అంత మంచిది కదా! ★

# వారసురాళ్లు వచ్చేస్తున్నారు..!

**శ్రీదేవి కూతురు సినిమాల్లోకి వస్తోందట... ఏడాదీ రెండేళ్ల నుంచీ ఇంటర్నెట్‌లో అభిమానులను ఊరిస్తోన్న అంశం. హీరో రాజశేఖర్ తనయ కూడా హీరోయిన్ అవుతుందట... ఈమధ్య తెరమీదికొచ్చిన విషయం. సైఫ్ అలీఖాన్ కూతురు మొదటి సినిమా షూటింగ్ జరుగుతోంది... కొత్తగా తెలిసిన వార్త. హీరో హీరోయిన్ల వారసురాళ్లూ సినిమాల్లోకి రావడం ఇప్పుడు పెరుగుతోన్న ట్రెండ్ మరి. ఇంకా ఆ లిస్టులో ఎవరెవరున్నారో చూద్దామా..?**

శివాని

జాన్వీ కపూర్

నీహారిక

సారా అలీ ఖాన్

అక్షర హాసన్

ఐశ్వర్యా అర్జున్

## అప్పుడే ఎంత క్రేజో..!

సినిమాల్లోకి వస్తుందన్న వార్తతోనే బోలెడంత క్రేజ్‌నీ మీడియా ఫాలోయింగ్‌నీ సంపాదించుకున్న అమ్మాయి ఎవరన్నా ఉన్నారంటే తప్పకుండా అది జాన్వీ కపూరే. ఈ అమ్మడు అందాల తార శ్రీదేవి కూతురు మరి. 19ఏళ్ల జాన్వి- కరణ్ జోహార్ ధర్మ ప్రొడక్షన్ ద్వారా త్వరలో హీరోయిన్‌గా పరిచయం కాబోతోందట. సినిమాల్లోకి రావాలనే ఆలోచనతోనే చదువు పూర్తయ్యాక లాస్ ఏంజెలెస్‌లోని 'ద లీ స్ట్రాస్‌బర్గ్ థియేటర్ అండ్ ఫిల్మ్ ఇన్‌స్టిట్యూట్'లో నటనలో శిక్షణ కూడా తీసుకుంది.

## డాక్టర్ అయి యాక్టర్‌గా...

రాజశేఖర్, జీవితల పెద్ద కూతురు శివాని ఏ సినిమాతో హీరోయిన్ అవుతుందనేది ఇప్పుడు తెలుగు చిత్ర పరిశ్రమలో హాట్ టాపిక్. నటీ నటులుగా తల్లినీతండ్రినీ తెర మీద చూసిన శివాని చిన్నప్పుడే హీరోయిన్ అవ్వాలనుకుందట. అయితే, 'చదువయ్యాక సినిమాల గురించి ఆలోచించు' అని రాజశేఖర్ చెప్పడంతో నాన్నలా ముందు డాక్టర్ అవ్వాలని ఎంబీబీఎస్‌లో చేరింది. ఈమధ్యే తమిళ సినిమా 'కుంకీ-2'లో శివానితో హీరోయిన్ పాత్ర చేయించేందుకు జీవితా రాజశేఖర్‌ను సంప్రదించాడట ఆ చిత్ర దర్శకుడు ప్రభు సాలమన్.

## సైఫ్ వారసురాలు

బాలీవుడ్ హీరో సైఫ్ అలీఖాన్ ఒకప్పటి నటి అమృతా సింగ్‌ల కూతురు సారా అలీఖాన్‌ని కొద్ది రోజుల్లోనే హీరోయిన్‌గా తెరమీద చూడొచ్చు. 'ధోనీ' సినిమాలో హీరో పాత్ర చేసిన సుశాంత్ సింగ్ రాజ్‌పుత్ సరసన ఆమె నటిస్తోన్న 'కేదార్‌నాథ్' చిత్రం ప్రస్తుతం షూటింగ్ జరుపుకుంటోంది. సారా తల్లి అమృతా సింగ్, సైఫ్ అలీఖాన్‌లు విడాకులు తీసుకున్న తరవాత సైఫ్ 2012లో కరీనా కపూర్‌ని పెళ్లి చేసుకున్నాడు.

## అక్కలానే చెల్లీ!

కొన్నేళ్ల కిందట తెరంగేట్రం చేసిన కమల్‌హాసన్ కూతురు శృతి హాసన్ ఇప్పటికే తెలుగు, తమిళంలో అగ్ర హీరోయిన్ల జాబితాలో చేరిపోయింది. ఇప్పుడు ఆ వరుసలోకి ఆమె చెల్లెలు అక్షరా హాసన్ కూడా వస్తోంది. ఆమధ్య హిందీ సినిమా 'షమితాబ్'లో హీరోయిన్‌గా కనిపించిన ఈ ముద్దుగుమ్మ నటించిన మరో రెండు హిందీ, తమిళ సినిమాలు త్వరలో విడుదల కానున్నాయి. వీటి తర్వాత ఓ కన్నడ చిత్రంలో నటించబోతోందని సమాచారం.

## మెగా హీరోయిన్

గతేడాది 'ఒక మనసు' సినిమాతో వెండితెరకు పరిచయమైన మెగా బ్రదర్ నాగబాబు కూతురు నీహారిక హీరోయిన్‌గా ఈ ఏడాది మరో రెండు సినిమాల్ని ఒప్పుకుంది. వీటిలో తమిళ చిత్రం 'ఒరు నల్ల నాల్ పాత్తు సొల్రెన్' ప్రస్తుతం షూటింగ్ జరుపుకుంటోంది. దీంతోపాటు తెలుగులో కొత్త దర్శకుడు రవి దుర్గాప్రసాద్ తీస్తున్న చిత్రానికి ఓకే చెప్పిందట.

## అందాలబొమ్మ... అర్జున్ కూతురు!

తమిళంతో పాటు తెలుగులోనూ హీరోగా ఎన్నో సినిమాలు చేసిన నటుడు అర్జున్ కూతురు ఐశ్వర్య కూడా హీరోయిన్‌గా ఇప్పటికే తమిళంలో తెరంగేట్రం చేసింది. ఆమె హీరోయిన్‌గా చేస్తున్న మరో రెండు సినిమాలు ప్రస్తుతం తమిళ, కన్నడ భాషల్లో తెరకెక్కుతున్నాయి. ముందు ముందు ఈ అందాల బొమ్మను కూడా తెలుగు తెర మీద చూసే అవకాశం లేకపోలేదు.

వీళ్లే కాదు, ఈమధ్యే విడుదలైన 'పిచ్చిగా నచ్చావ్' చిత్రంతో హాస్య నటుడు ఉత్తేజ్ కూతురు కూడా హీరోయిన్‌గా ఎంట్రీ ఇచ్చేసింది. ఈ వరుసలో ఇంకాస్త వెనక్కు వెళ్తే మరికొందరూ ఉన్నారు.

అదండీ సంగతి... హీరో హీరోయిన్ల వారసురాళ్లకు వావ్ చెప్పండి మరి..!



# వానాకాలం కబుర్లు..!

వర్షాన్ని మొదటిసారి చూసినపుడు పిల్లలు ఆశ్చర్యంగా 'ఆకాశంలో నుంచి నీళ్లెలా పడుతున్నాయమ్మా'... అని అడిగితే... 'పైనున్న దేవుడు స్నానం చేస్తున్నాడమ్మా...' అని సరదాగా వారికి అర్థమయ్యే భాషలో చెప్పేవాళ్లు ఇదివరకటి అమ్మలు. కానీ విచిత్రం ఏంటంటే... వాన గురించి మనక్కూడా తెలియని ఆసక్తికర విషయాలు ఎన్నో ఉన్నాయి.

**వా**నలో తడిస్తే బట్టలు ఎర్రగా అయిపోవడం ఎప్పుడైనా చూశారా... కానీ కేరళ వాసులకి అలాంటి అనుభవమూ ఎదురైంది. అక్కడి కొట్టాయం ప్రాంతంలో ఎర్రటి వర్షం కురుస్తుంటుందట మరి. దీనికి గాలిలో ఉన్న ఒకరకమైన ఆల్గేనే కారణమట. ఇలాగే ప్రపంచవ్యాప్తంగా కొన్నిచోట్ల పసుపు, ఆకు పచ్చ, నలుపు వర్షాలు కూడా పడినట్లు చెబుతారు.



**ప్ర**పంచంలో బాగా భారీ వర్షాలు కురిసే ప్రాంతం ఎక్కడ ఉందో తెలుసా... మనదేశంలోనే. మేఘాలయలోని మాసిన్రామ్ గ్రామంలో ఏడాదికి 11,873 మిల్లీమీటర్ల వర్షం కురుస్తుందట. దగ్గర్లోని హిమాలయ శిఖరాలు వర్షపు మేఘాలను అడ్డుకోవడం వల్లే ఇక్కడ వర్షాలు బాగా కురుస్తున్నాయట. అందుకే, ఈ ప్రాంతం నదులూ జలపాతాలకు నిలయంలా ఉంటుంది. ఇక్కడకు దగ్గర్లోనే ఉన్న చిరపుంజి పేరుమీద కూడా గొప్ప రికార్డు ఉంది. ఇప్పటివరకూ భూమ్మీద ఒక్క ఏడాదిలో అతి ఎక్కువ వర్షపాతం నమోదైంది అక్కడే. 1860 ఆగస్టు-1861 జులై మధ్యకాలంలో చిరపుంజిలో 26,461 మిల్లీ మీటర్ల వర్షం కురిసింది.






**అ**ప్పుడప్పుడూ వర్షం తరవాత ఆకాశంలో ఇంద్రధనుస్సు కొంత సేపు కనిపిస్తుంది. అది సహజమే. కానీ 1994లో బ్రిటన్‌లోని షెఫీల్డ్‌లో ఉదయం తొమ్మిది నుంచి సాయంత్రం మూడు గంటలవరకూ హరివిల్లు కనిపించింది. అదే సుదీర్ఘకాలం కనిపించిన ఇంద్రధనుస్సు. ఇంద్రధనుస్సులు ఒకేసారి రెండూ మూడు కూడా ఏర్పడతాయి.



**ము**ప్ఫై ఏళ్లకిందట బంగ్లాదేశ్‌లోని గోపాల్‌గంజ్‌లో కిలో బరువు ఉన్న వడగండ్లతో వర్షం పడింది. ఆ దెబ్బలకు 92మంది చనిపోయారు. అతి బరువైన వడగండ్లుగా ఇవి గిన్నిస్ రికార్డులకూ ఎక్కాయి.

**వ**ర్షం అంటే... ఆకాశంలో నుంచి నీరే పడుతుందనుకుంటే పొరబడినట్లే. కొన్నిచోట్ల చేపల వర్షం కూడా కురుస్తుంది. హోండురస్‌లోని యొరో నగరంలో శతాబ్ద కాలంగా ఏటా మే, జూన్‌లలో ఈ తరహా వర్షం పడుతోంది. వర్షం ఆగిపోయాక అక్కడ దొరికే చేపల్ని తీసుకెళ్లి స్థానికులు వండుకుని తింటారట. దీనికి గుర్తుగా వాళ్లు ఏటా 'రెయిన్ ఆఫ్ ఫిష్ ఫెస్టివల్' అని ఓ వేడుకను కూడా జరుపుకుంటున్నారు. ఆమధ్య మన దగ్గర కూడా గుంటూరులో చేపల వర్షం పడిందని కథనాలు వచ్చాయి. మిస్సోరీ, గ్రీస్, బ్రిటన్లలో వర్షంతో పాటు ఆకాశంలో నుంచి కప్పలు పడినట్లూ ఆధారాలున్నాయి.



**సం**వత్సరమంతా వర్షం పడటం చూడాలంటే హవాయిలోని కవాయి ద్వీపానికి వెళ్లాల్సిందే. అక్కడి 'వయలెఎలె' పర్వతం మీద దాదాపు 350 రోజులూ వాన కురుస్తుందట.

★ భూమధ్య రేఖకు దగ్గర్లో ఉన్న ప్రాంతాల్లో రోజూ సాయంత్రం నాలుగ్గంటలకు కొద్దిపాటి వర్షం కురుస్తుందట. దీన్ని 'ఫోర్ ఓ క్లాక్ రెయిన్' అంటారు. దీనిక్కారణం ఆయా ప్రాంతాల్లో మధ్యాహ్నం అయ్యేసరికి సూర్యుడి కిరణాలు నిట్టనిలువుగా పడటంతో వేడి తీవ్రత బాగా పెరిగి నీరు ఎక్కువ స్థాయిలో ఆవిరవుతుంది. సూర్యుడి తీక్షణత తగ్గేసరికి ఆ ఆవిరంతా ద్రవీభవించి వర్షంలా పడుతుంది.

★ క్యూబాలో వర్షం ఎప్పుడూ మధ్యాహ్నానికీ సాయంత్రానికీ మధ్యలో పడుతుందట. థాయ్‌లాండ్‌లో ఎవరిపనికీ ఇబ్బంది కలిగించకుండా రాత్రిపూట మాత్రమే కురుస్తుంది.

★ ప్రపంచంలో అతి తక్కువ వర్షపాతం నమోదయ్యేది అంటార్కిటికాలో. అక్కడ ఏడాది మొత్తమ్మీదా కురిసే వర్షం కేవలం 166 మిల్లీమీటర్లే.

★ సిహోయోలోని వేన్స్‌బర్గ్‌లో ఏటా జులై 29న కచ్చితంగా వర్షం పడుతుంది. వందేళ్ల కిందట ఓ వ్యక్తి ఈ విషయాన్ని గమనించి స్థానికులకు చెప్పడంతో వెలుగులోకి వచ్చింది. అప్పట్నుంచీ ఆ లెక్క తప్పలేదు. అందుకే, ఆ రోజుని స్థానికులు పండుగలా చేసుకుంటారు.

★ వాన చుక్కా మామూలు నీటి బిందువులానే ఉంటుందనుకుంటాం. కానీ చినుకు చాక్లెట్ చిప్ ఆకారంలో ఉంటుందట. బాగా చిన్న చినుకులైతే గుండ్రంగా ఉంటాయి.

★ కుండపోతగా వర్షం కురుస్తున్నపుడు ఆ చినుకులు మనల్ని కొడుతున్నట్లు అనిపిస్తాయి కదా... నిజానికి చినుకులు సగటున గంటకు 22 మైళ్ల వేగంతో దూసుకొస్తాయట. భూమ్మీద ఉన్న వాతావరణం కారణంగా కిందికొచ్చేసరికి ఆ వేగం చాలా తగ్గుతుంది. లేదంటే వర్షంలో తడిచిన ప్రతిసారీ మనకు వాతలే మిగిలేవేమో.

★ ఎడారుల్లో వర్షం పడుతున్నా తడవమట. అక్కడున్న వేడి గాలుల వల్ల పడే చినుకులు నేలమీదకు చేరకుండానే ఆవిరైపోతుంటాయి మరి. ఈ తరహా వానను దెయ్యం వాన (ఫాంటమ్ రెయిన్)అంటారు. అందుకే, అలాంటి చోట్ల వర్షం పడుతున్నా కొన్నిసార్లు చూసేవారికి తెలియదు.

★ మామూలుగా మనం మొక్కల మీద నీళ్లు పోసినప్పటికన్నా వర్షం పడినపుడు ఆకులు ఎక్కువ పచ్చగా కనిపిస్తాయి. వాన నీటిలో ఉండే నైట్రోజన్ మొక్కకూ ఆకులకూ సహజ ఎరువులా పనిచేసి దాన్ని ఆరోగ్యంగా చెయ్యడమే అందుక్కారణం.

★ వర్షం పడినపుడు మట్టిలో నుంచి ఒకరకమైన మంచి వాసన వస్తుంటుంది. వాతావరణం వేడిగా ఉన్నప్పుడు మొక్కలు భూమిలోకి విడుదల చేసే నూనెలు వర్షం పడినపుడు నేలలోని బ్యాక్టీరియా విడుదలచేసే జియోస్మిన్ అనే పదార్థంతో కలవడం వల్ల ఆ మట్టి వాసన వస్తుందట.

★ మనకు కాసుల వర్షం అన్న పేరు ఎలా వచ్చిందో కానీ బోట్స్‌వానాలో ఏకంగా కరెన్సీనే వర్షం పేరుతో పిలిచేస్తున్నారు. 'పులా' అంటే స్థానిక భాషలో వర్షం అని అర్థం. ఆ పేరునే వారి కరెన్సీకి పెట్టారు... మనం 'రూపాయి' అంటాం కదా, అలా అన్నమాట.

★ ఆఫీసుకు బయలుదేరగానే వాన కురిస్తే మనమైతే ఏ గొడుగో, రెయిన్‌కోటో వేసుకుని ఎలాగోలా వెళ్తాం. కానీ పోర్చుగీస్‌లో వర్షం వస్తే ఎవరైనా ఆఫీసుకు వెళ్లడం మానేయొచ్చట. మిగిలిన ఐరోపా దేశాలతో పోలిస్తే అక్కడ ఎండలు ఎక్కువగానే ఉంటాయి. కానీ వర్షం మొదలైతే మాత్రం అప్పటికపుడు భారీగా కురుస్తుంది. ఆ చినుకులు కూడా చాలా చల్లగా ఉంటాయట. అందుకే, ప్రభుత్వం వాన పడితే సెలవు తీసుకోవచ్చని అధికారికంగా ప్రకటించింది.

★ ఎంత పెద్ద ఉరుములు వచ్చినా ఉగాండా ప్రజలు భయపడరట. అక్కడ ఉరుములు సాధారణమైన విషయం మరి. ఏడాదికి కొన్ని వందల సార్లు ఆకాశం గర్జిస్తుంది.

★ పదికోట్ల మందిలో ఒకరికి 'వాన అలర్జీ' ఉండే అవకాశం ఉంది. చినుకు ఒంటి మీద పడగానే వారి చర్మం ఎర్రగా కందిపోయి ఉబ్బిపోతుందట. ఇది ప్రాణాలు తీసేంత ప్రమాదకరమైన వ్యాధి.

★ ఎండా వానలు ఒకేసారి వచ్చినపుడు పూర్వం కుక్కానక్కా పెళ్లి చేసుకుంటున్నాయి అనేవారు. ఎలా ప్రాచుర్యం పొందిందో తెలియదు కానీ ఆఫ్రికా, జపాన్, బంగ్లాదేశ్‌లాంటి దేశాల్లోనూ ఇదే చెబుతారు. మరికొన్ని దేశాల్లో దెయ్యాలు పెళ్లి చేసుకుంటున్నాయనీ, కోతులూ, ఎలుగుబంట్ల పెళ్లనీ, దుప్పులూ, హైనాలూ పిల్లల్ని కంటున్నాయనీ... ఇలా చాలా కథలే వాడుకలో ఉన్నాయి.



# కదంబం

## బావులు భలేగా!

కేరళ అందాలకు నెలవు. ప్రకృతి తీర్చిదిద్దిన అందాలే కాదు దానికి పోటీగా తాముండే పరిసరాల్నీ అలంకరించుకోవాలనుకుంటారు అక్కడి వాళ్లు. అందుకే ఇళ్ల నుంచీ నీటి పాయల్లో తిరిగే పడవల దాకా అన్నీ విభిన్నంగానే కనిపిస్తాయి మనకు. అందులో భాగంగానే తమ ఇళ్లలో ఉండే బావుల్నీ అందంగా తీర్చిదిద్దుకుంటారట. ఇత్తడి గంగాళంలా, ఢమరుకం-వయొలిన్‌లా, పుచ్చపండు ముక్కలా...ఇలా రకరకాలుగా ఇక్కడ కనిపిస్తున్నవన్నీ అక్కడి ఇళ్లలో ఉండే బావులే. నీళ్లుండేవీ, నిత్యం వాడుకునేందుకు పనికొచ్చేవి కూడా. ఎంతబాగున్నాయో చూడండి అంటూ ఈ మధ్య వాట్సప్, ఫేస్‌బుక్‌లాంటి సామాజిక మాధ్యమాల్లో తెగ చెక్కర్లు కొట్టేస్తున్న ఈ చిత్రాలు నిజంగానే బాగున్నాయి కదూ!

## పావురాలు కాదు చెప్పులే

జపాన్‌కు చెందిన క్యోటో ఒహతాకు పావురాలంటే ఎంతో ఇష్టం. అందుకోసం తన ఇంటి వద్ద ఉన్న ఒక పార్కుకు వెళుతూ ఉండేది. కానీ ఆమె వాటికి దగ్గరగా వెళ్లే సరికి అన్నీ చెల్లాచెదురైపోయేవి. దీంతో వాటికి దగ్గరగా తిరగాలన్న ఆమె కోరిక అలాగే ఉండిపోయింది. అందుకు ఆమె ఒక ఉపాయం చేసింది. ఒక జత నల్ల చెప్పులను తెచ్చుకుని వాటిని అచ్చం పావురాన్ని తలపించేలా తయారుచేసింది. ఇక ఆ చెప్పులు వేసుకుని పావురాల దగ్గరికి వెళ్లినా అవేమీ భయపడకుండా వాటి పని అవి చేసుకుంటున్నాయట. ఈ విషయాన్ని ఆమె నెట్లో పెట్టేసరికి దానికి విపరీతమైన స్పందన వచ్చింది. ఏదేమైనా క్యోటోది భలే ఆలోచన!

## మనసును తాకే చిత్రం!

ఈ బొమ్మల్లో కుందేలూ కుక్కా కన్పిస్తున్నాయి కదా. ఇప్పుడు కాస్త జాగ్రత్తగా వాటిని మరోసారి చూడండి. ఒక చిత్రంలో అమ్మానాన్నా చిన్న బాబూ, మరో దాన్లో అన్నా చెల్లెళ్లు కన్పిస్తారు. 'మీరూ మీ పిల్లలతో పాటు ఇంట్లో ఎప్పుడూ ఒక పెంపుడు జంతువుకి చోటు ఉంటుంది' అని మనసును తాకేలా చెప్పేందుకు ముంబైకి చెందిన ఆర్ట్ డైరెక్టర్ ప్రణవ్ భిడ్ చేసిన ప్రయత్నమిది. 'వరల్డ్ ఫర్ ఆల్' జంతు సంరక్షణ సంస్థ ముంబైలో నిర్వహించిన పెంపుడు జంతువుల దత్తత కార్యక్రమంకోసం రూపొందించిన ఈ పోస్టర్లు ఇంటర్నెట్‌లో వైరల్‌గా మారాయి. అంతేకాదు, గతేడాదితో పోలిస్తే జంతువుల్ని దత్తత తీసుకోవడం కూడా పెరిగిందట.

## బీచ్ తెరలు...

విదేశాల్లో సన్‌బాత్ అంటూ ఎండ ఒంటికి తగిలేలా బీచుల్లో పడుకోవడం మనకు తెలిసిందే. అయితే పోలండ్‌లోని బాల్టిక్ సముద్రపు బీచుల్లో మాత్రం ఇలా సేద తీరేవాళ్లు తాము కూర్చున్న ప్రదేశం చుట్టూ ఇక్కడ కనిపిస్తున్నలాంటి తెరల్ని కట్టుకోవాల్సిందే. వాటిని బీచ్ సెపరేటర్స్ అని పిలుస్తున్నారు. ఎంతమందిలో ఉన్నా ఎవరికి వాళ్లకి ఏకాంత స్థలం ఉండటానికి ఇలా కట్టుకుంటున్నారంటూ సోషల్ మీడియాలో దీని గురించి పోస్టులు వస్తున్నాయి. అయితే ఇది ఎప్పటి నుంచో ఉన్న విధానమేననీ, బాల్టిక్ సముద్రపు గాలులు ఉద్ధృతంగా ఉంటాయి కనుక, కళ్లలో ఇసుక పడకుండా మాత్రమే ఈ ఏర్పాటనీ అక్కడి వాళ్లు చెబుతున్నారు.



## ఈ షిప్పు ఓ హోటల్!

అరె... నీళ్లలో తిరగాల్సిన నౌక ఇలా కొండెక్కిందేమిటి అని ఆశ్చర్యపోకండి. ఇది అచ్చంగా నౌకలా నిర్మించిన ఓ అధునాతన హోటల్. దక్షిణకొరియాలోని జియాంగ్‌డాంగ్జిన్ పట్టణంలో ఉన్న ఈ హోటల్ పేరు సన్ క్రూయిజ్ రిసార్ట్ అండ్ యాట్. అక్కడి సీ ఆఫ్ జపాన్ సముద్రపు ఒడ్డున ఎత్తైన కొండమీద అచ్చం విలాసవంతమైన నౌక ఆకృతిలో దీన్ని నిర్మించారు. మొత్తం 211 గదులూ, ఫంక్షన్ హాళ్లతో పాటూ బార్, ఫిట్‌నెస్ సెంటర్, వాలీబాల్, గోల్ఫ్‌కోర్టులూ ఉన్నాయిందులో. ఇది సముద్రంలో ఉన్న అనుభూతిని కలిగించేందుకు స్విమ్మింగ్ పూల్‌లో ఉప్పునీళ్లు ఉంచడంతో పాటూ, షిప్‌లో సంగీతానికి బదులు అలల శబ్దాన్ని వినిపిస్తారట.



# ఆ రైల్లో పుస్తకాలు దాచిపెడతారు!

**బస్టాండుల్లో, రైల్వే స్టేషన్లలో, విమానాశ్రయాల్లో ఒకప్పుడు తప్పకుండా కన్పించేది... పుస్తకాల దుకాణం. ప్రయాణంలో విసుగు రాకుండా చదువుకోవడానికి ప్రతివారూ ఓ పుస్తకం కొనుక్కుని ప్రయాణం ప్రారంభించేవారు. దుకాణాలు ఇప్పుడూ ఉన్నాయి కానీ కొనేవారే కన్పించడం లేదు. సెల్‌ఫోన్ చేతికొచ్చాక పుస్తకం దూరమైంది. పుస్తకపఠనం మంచి అభిరుచి అని అందరికీ తెలుసు. అయినా ఫోనూ దానిలోని సామాజిక మాధ్యమాలూ పుస్తకాన్ని మరిపించేస్తున్నాయి.**






ఢిల్లీలో నివసించే ఉద్యోగులకు మెట్రో ప్రయాణం తప్పనిసరి. యువజంట శ్రుతి శర్మ, తరుణ్ చౌహాన్‌లు కూడా రోజూ ఉదయం లేవగానే హడావుడిగా తయారై ఆఫీసులకు బయల్దేరతారు. సమయానికి మెట్రో అందుకుంటే ఆఫీసుకు వెళ్లిపోయినట్లే లెక్క. అందుకే ఆ పరుగు. రైలెక్కి కూర్చున్నాక కాస్త తేరుకుని చుట్టూ చూస్తే ఎవరి ఫోనులో వాళ్లు బిజీ. పరిసరాలతో నిమిత్తం లేకుండా అందరూ తలలు వంచి చేతిలోని ఫోను చూసుకోవడం చూస్తే శ్రుతికి విచారం ముంచుకొచ్చేది. ఆఫీసుకి వెళ్లాక ఎలాగూ కంప్యూటర్‌ని వదిలేది ఉండదు. ప్రయాణంలో కాసేపైనా నలుగురితో స్నేహంగా కబుర్లు చెప్పాలనీ మంచి పుస్తకం గురించి చర్చించాలనీ ఉంటుంది శ్రుతికి. కనీసం భర్త అయినా తోడుంటే బాగుండును కానీ ఇద్దరిదీ చెరో మార్గం. కాబట్టి వేర్వేరు రైళ్లు ఎక్కుతారు. అలా ప్రయాణంలో రోజూ రెండు గంటలు ఒంటరితనంతో విసిగిపోయిన శ్రుతి 'బుక్స్ ఆన్ ద దిల్లీ మెట్రో' పథకానికి శ్రీకారం చుట్టింది.

## ఎమ్మా వాట్సన్ స్ఫూర్తి

శ్రుతి, తరుణ్‌లకు పుస్తకపఠనం అంటే చాలా ఇష్టం. రచయిత్రి కూడా అయిన శ్రుతికి నచ్చిన పుస్తకమల్లా కొని చదివే అలవాటుండడంతో వాళ్ల ఇంట్లో చాలా పుస్తకాలు చేరాయి. ఆ మంచి పుస్తకాలను ఇతరులూ చదవాలి. సాహితీ పరిమళాలను ఆస్వాదించాలి. అప్పుడే వాటికి సార్థకత... అనుకున్న ఆ జంట 'బుక్స్ ఆన్ ద దిల్లీ మెట్రో' పథకంతో తమ ఆలోచనకు ఆచరణ రూపమివ్వడం ప్రారంభించింది. ఈ విషయాలు చర్చిస్తున్నప్పుడే శ్రుతికి హ్యారీ పాటర్ నటి ఎమ్మా వాట్సన్ గుర్తొచ్చింది. ఐక్యరాజ్య సమితికి సౌహార్ద్ర రాయబారి అయిన ఎమ్మా 'బుక్స్ ఆన్ ద అండర్‌గ్రౌండ్' అనే ప్రాజెక్టుతో కలిసి పనిచేసింది. లండన్‌లో ప్రఖ్యాతిగాంచిన అండర్‌గ్రౌండ్ రవాణా వ్యవస్థ వినియోగదారుల కోసం మొదలైంది ప్రాజెక్టు. పలువురు ప్రచురణకర్తలు, గ్రంథాలయాల సహకారంతో కొత్త, పాత పుస్తకాలను రైళ్లలో అక్కడక్కడా దాచిపెడతారు. అవి ఎవరికి దొరికితే వారు తీసుకుని చదివి మళ్లీ తిరిగి మరోచోట పెట్టాలి. ఈ పథకానికి ప్రచారం కల్పించే నిమిత్తం ఎమ్మా వాట్సన్ తనకెంతో ఇష్టమైన రచయిత్రి మాయా యాంజెలో పుస్తకం 'మామ్ అండ్ మి అండ్ మామ్' వంద కాపీలను కొని లండన్ అండర్ గ్రౌండ్‌లో వివిధ ప్రాంతాల్లో దాచిపెట్టింది. న్యూయార్క్ సిటీ సబ్‌వేలోనూ ఇలాంటి పథకం అమలుచేస్తున్నారు. వాటిని స్ఫూర్తిగా తీసుకున్న శ్రుతి భర్త తరుణ్‌తో కలిసి దిల్లీ మెట్రో అధికారులతో చర్చించి వారి అనుమతి తీసుకుంది. అలా ఈ జంట గత మేలో తమ పథకానికి శ్రీకారం చుట్టింది. 'బుక్స్ ఆన్ ద మెట్రో' లోగోతో పాటు 'తీసుకోండి... చదవండి... తిరిగి ఇక్కడ పెట్టి మరొకరికీ ఇది చదివే అవకాశమివ్వండి..' అన్న నోట్‌తో పుస్తకం పైన ఒక స్టిక్కర్ అతికించి మెట్రో రైలులో వదిలిపెట్టింది శ్రుతి.

## పంచుకోవడంలోనే ఆనందం

పుస్తకాన్ని ఎక్కడో దాయడమే కాదు దాని గురించి ఫేస్‌బుక్, ట్విటర్, ఇన్‌స్టాగ్రామ్‌లలో టీజర్లు కూడా పెడుతుంది శ్రుతి. ఏ రూట్‌లో వెళ్లే మెట్రో రైలులో తాము ఏ బుక్ పెట్టిందీ తెలిసేలా క్లూ ఇస్తూ సరదా వ్యాఖ్యలతో ఈ పోస్టులు పెడుతుంది. బుక్ తీసుకున్నవారు ఫేస్‌బుక్‌లో ఉన్న 'బుక్స్ ఆన్ దిల్లీ మెట్రో'ని ట్యాగ్ చేస్తూ ఆ విషయం చెప్పాలి. శ్రుతి మూడు పుస్తకాలు వదిలిపెట్టగానే స్పందన మొదలైంది. మొదటి రెండు పుస్తకాలూ ఏమయ్యాయో తెలియకపోయినా ఆమె నిరాశ చెందలేదు. తన ప్రయత్నం కొనసాగించింది. మూడో పుస్తకం పెట్టిన కొద్ది గంటలకే ఫేస్ బుక్‌లో తనని ట్యాగ్ చేస్తూ సందేశం రావడంతో శ్రుతికి చెప్పలేనంత సంతోషం వేసింది. అలా ఇప్పటికే కొన్ని పదుల పుస్తకాలను రైళ్లలో వదిలిన వీరు ఇప్పుడు రోజూ ఓ పుస్తకం చొప్పున వదిలిపెడుతున్నారు. హార్పర్ కోలిన్స్ ప్రచురణ సంస్థ తమ 25వ వార్షికోత్సవం సందర్భంగా కొన్ని సరికొత్త నవలల్ని ఈ ప్రాజెక్టుకోసం బహూకరించడం విశేషం.

చదవాలనుకున్న పుస్తకాలన్నీ కొని చదవడం అందరికీ సాధ్యమయ్యే పని కాదు కాబట్టి ఇలా పంచుకుంటే తక్కువ ఖర్చుతో ఎక్కువ పుస్తకాలు చదవొచ్చంటారు ఈ పుస్తకప్రియులు. ముందు తమ దగ్గరున్న పుస్తకాలన్నీ ఇచ్చేస్తామనీ ఆ తర్వాత ఏం చేయాలన్నది ఆలోచిస్తామంటున్నారు. ఈ లోపల ఆసక్తి కలవారెవరైనా ఈ పథకంలో చేరవచ్చంటూ ఆహ్వానిస్తున్నారు. చదివేసిన పుస్తకం బీరువాలో పడి ఉండేకన్నా ఇలా మరో పదిమంది చదువుకోవడానికి ఉపయోగపడితే అంతకన్నా ఆనందం ఏముంటుంది? పైగా కాణీ ఖర్చులేకుండా చదవడానికి పుస్తకం లభిస్తుంటే పఠనాభిలాషులకు పండగే కదా!





కథ

# మేము చదువుకోనివ్వం

– జ్యోతి సుంకరణం

"ఊరికి దగ్గర్లోనే మంచి కాలేజీ ఉందంటు న్నావ్, పైగా మీ వాడు కూడా బాగానే చదువు తాడంటున్నావ్, మరి అలాంటప్పుడు ఇంత దూరంలో ఇక్కడ హాస్టల్లో పెట్టి చదివించాల్సిన అవసరం ఏముందిరా?" తుంచిన ఇడ్లీ ముక్కని కొబ్బరి చట్నీలో ముంచి నోట్లో పెట్టుకుంటూ అడిగాడు విశ్వనాథం స్నేహితుడు భూషణాన్ని.

"నీకు తెలీనిదేం ఉందిరా, పల్లెటూళ్ళలో చదువులు కూడా ఒక చదువులేనా... పైగా అక్కడే ఉంటే వాళ్ళ నాన్నమ్మా, అమ్మా వాడిని అతి గారం చేయడం, వీధుల్లో తోటి పిల్లలతో ఆటలాడటం తప్ప, ఇంకోటి ఉండదు. ఏదో ఇంత వరకూ వంటబట్టిన చదువు కూడా అటకెక్కు తుంది. ఇంటికి దూరంగా హాస్టల్లోపెట్టి చదివిస్తే నాలుగు అక్షరం ముక్కలతోపాటు నాలుగు విషయాలు కూడా తెలుస్తాయి. అన్నిటికంటే ముఖ్యంగా వాణ్ని ఇంజినీరు చేయాలనే గట్టి పట్టుదలతో ఉన్నాన్నేను. నాకు తెలిసినవాళ్ళు ఒకళ్ళిద్దరు వాళ్ళ పిల్లల్ని ఇక్కడికి తీసుకొచ్చే జాయిన్ చేశారట. ఇప్పుడు వాళ్ళు ఇంజినీర్లూ, డాక్టర్లూ అయి మంచి పొజిషన్లో ఉన్నారు. నేనెలాగూ అక్కడే ఉండిపోయి ఆ పల్లెటూరికి అంకితమైపోయాను. వీడైనా బాగా చదువుకుని ఇంజినీరయ్యి నా ఆశలు నెరవేర్చాలి. మా కుటుంబంలో కూడా ఒక ఇంజినీరు ఉన్నాడని చెప్పుకోవాలి" అన్నాడు భూషణం తాను ఇడ్లీ తినడం పూర్తిచేసి చెయ్యి కడుక్కుంటూ.

"కానీ, ఒకసారి ఆలోచించుకో. మీవాడి ఇష్టాయిష్టాలేమిటో కూడా తెలుసుకున్నావా, వాడు పూర్తి పట్టుదలతో ఈ చదువు చదవాలీ అని ఉంటేనే..." అని ఇంకా ఏదో చెప్పబోతున్న విశ్వనాథాన్ని మధ్యలోనే ఆపేసి-

"వాడి ఇష్టమేంటిరా, వాడి మొహం. ఏది చదువుకోమంటే అదే చదువుకుంటాడు. ఇంటికి దూరంగా ఉంటాడు కాబట్టి మొదట్లో కాస్త ఇబ్బందిపడతాడు. తరవాత వాడే అలవాటుపడిపోతాడు. అయినా వాడి భవిష్యత్తు బావుండాలనే కదా ఇదంతా" అన్నాడు భూషణం.

"అవునన్నయ్యా, మీరు బాగా చెప్పారు. ఈ వయసులో మంచి చదువులో పెడితే బాగా పైకి వస్తారు. అదే గాలికి వదిలేస్తే అలాగే తయారవు తారు. ఆ ఊళ్ళో ఉంచేస్తే ఏమొస్తాయ్... అదే ఇక్కడైతే ఆ స్పీడూ, ఆ కాంపిటీషనూ అన్నీ వస్తాయ్. రేపొద్దున్న ఏ ఐఐటీలోనో సీటొచ్చి చదువుకున్నాడంటే మీకెంత గొప్పగా ఉంటుంది. ఆ తరవాత వాడు ఫారెన్‌లో సెటిల్ అయ్యా డంటే మీరూ, వదినా కూడా ఎంచక్కా ఫారెన్ చెక్కెయ్యొచ్చు, మీ లైఫ్‌స్టైలే మారిపోతుంది" అంది విశ్వనాథం భార్య గీత ఉత్సాహంగా చేతిలోని కాఫీ కప్పులని వాళ్ళిద్దరికీ అందిస్తూ.

"మరే... చెల్లెమ్మా, బాగా చెప్పావ్. పెద్ద చదువులు చదువుకుని అన్ని దేశాలూ తిరగాలని ఉండేది నాకు. అది ఎలాగూ కుదరలేదు, వీణ్ని అయినా ఇంజినీరుని చేసి ఆ కోరిక తీర్చుకోవాలి. ఎంత ఖర్చయినా పర్వాలేదు, మావాడు ఇంజి నీరైతే చాలు" అన్నాడు రెట్టించిన ఉత్సాహంతో కాఫీ కప్పుని అందుకుంటూ భూషణం.

"అయితే సరే, నువ్వింత స్ట్రాంగ్ నిర్ణయంతో ఉంటే ఇంకేం, నాకు తెలిసిన రెసిడెన్షియల్ కాలేజ్ ఉంది ఈరోజే వెళదాం" అన్నాడు విశ్వనాథం డైనింగ్‌టేబుల్ ముందు నుంచి లేస్తూ.

★ ★ ★

కాలేజ్ వెయిటింగ్ హాల్లో కూర్చుని చుట్టూ అంతా చూస్తూ తన పక్కనే కూర్చున్న కొడుకు వైపుకి తిరిగి "చూడు, అంతా నీ వయసు పిల్లలే ఎంతమంది ఉన్నారో, మా కాలానికి ఇన్ని సదుపాయాలు లేవు. మా పేరెంట్సూ ఇన్ని ఆలోచించే వారు కాదు. మీకలా కాదు, దేనికీ వెనకాడక్కర్లేదు. అంచేత, ఆ ఊరి ధ్యాసా, ఆ ఇంటి ధ్యాసా పక్కనపెట్టి శుబ్బ రంగా చదువుకో" అని బుద్ధులు చెప్పాడు.

అమాయకమైన మొహంతో ఆశ్చర్యంగా పెద్ద కళ్ళేసుకునీ చుట్టూ ఉన్న అందరినీ చూస్తూ "సరే నాన్నా" అన్నాడు వాడు.

"అబ్బా, వాడే చదువుకుంటాడులేరా" అని విశ్వనాథం అంటూ ఉంటే, ఈలోగా చేతిలో ఒక జపమాల పట్టుకుని నోటిలో ఏదో గొణుక్కుంటూ వస్తున్న ఒక కుర్రాడూ, వాడి తల్లీతండ్రీ వచ్చి వీళ్ళ పక్కనే కూర్చున్నారు.

ఆ కుర్రాడిని పైనుంచి కిందవరకూ చూసి భూషణం కుతూహలం ఆపుకోలేక "ఏమిటండీ, మీ అబ్బాయి ఏదో గొణుక్కుంటున్నాడు ఏమిటీ?" అడిగాడు ఆరాగా.

"అదీ... మాకు ఒక స్వామీజీ చెప్పారు- మావాడు 108 రోజులు 108సార్లు ఎవరితో మాట్లాడకుండా అలా 'ఓం ఐఐటీ యాయ నమః' అని మంత్రం జపిస్తే తప్పకుండా సీటొస్తుందనీ, అందుకే ఇలా..." అంది కుర్రాడి తల్లి ఒకింత గర్వంతో పొంగిపోతూ వాళ్ళ అబ్బాయివైపు చూస్తూ.

"అవునా!" విషయం విని ఆశ్చర్యపోతూ నోళ్ళు తెరుచుకుని అలాగే చూస్తుండిపోయారు భూషణం, విశ్వనాథం.

ఈలోగా లోపలనుండి పిలుపు రావడంతో వెళ్ళారు. వీళ్ళు తీసుకెళ్ళిన సర్టిఫికెట్స్ అన్నీ చూసిన ఆ కాలేజీ ప్రిన్సిపాల్ "ఇప్పటివరకూ మార్క్స్ అన్నీ బానే వచ్చాయి" అని తృప్తిగా తల పంకించి, "బాబూ, నువ్విట్రా" అని భూషణం కొడుకుని పిలిచి, "ఏదీ నీ రైట్‌హ్యాం డ్‌తో నీ లెఫ్ట్ చెవి పట్టుకో" అన్నాడు. వాడు అలాగే చేశాడు. "ఈసారి అపోజిట్‌సైడ్ చెయ్యి" అన్నాడు. వాడు మారుమాట్లాడకుండా అలాగే చేశాడు. "ఓకే, గుడ్. ఇప్పుడు రూమ్ బైట గోడ మీద కొన్ని రాసి ఉన్నాయి, వెళ్ళి నేను వన్ టూ టెన్ నంబర్స్ లెక్కపెట్టేటప్పటికి అది కంఠతా పట్టేసి రావాలి" అని అంటూనే "యువర్ టైమ్ స్టార్ట్స్ నౌ... వన్, టూ, త్రీ" అంటూ నంబర్స్ లెక్క పెట్టెయ్యడం మొదలుపెట్టేశాడు. ఆ పిల్లాడు బాణంలాగా బయటికి పరుగెత్తికెళ్ళి పది అంకెలు లెక్కపెట్టేసరికి మళ్ళీ బాణంలాగా వచ్చే శాడు. "ఓకే, వెరీగుడ్. ఇప్పుడు చెప్పు, అక్కడ రాసి ఉన్నదేమిటో" అడిగాడు.

వాడు వెంటనే "శ్రీశ్రీశ్రీ రాజా బహద్దూర్ వీర చంద్రశేఖర రాజు గారు ఈ కాలేజీని నైంటీన్ నైంటీలో స్థాపించారు. ఈ విద్యాసంస్థ నుండి వచ్చిన ఆదాయంతో మరెన్నో విద్యా సంస్థలనూ, చారిటబుల్ ట్రస్టులనూ స్థాపించారు. వారు టూథౌజండ్ టూలో స్వర్గస్థులైనారు. వారి తదనంతరం వారి కుమారులైన శ్రీశ్రీశ్రీ..." అంటూ గడగడా చెప్పుకుపోతున్న వాణ్ని-

"చాలు చాలు చాలు. వెరీగుడ్, ఎక్సలెంట్" అని ఆపేసి "బావుందండీ, ఎందుకూ ఏమిటీ అని అడక్కుండా ఏది చెయ్యమంటే అది చేసి ఏది కంఠతా పెట్టమంటే అది పట్టేసి...ఎక్సలెంట్- మీవాడు మా కాలేజీకి అన్నివిధాలా ఫిట్. ఇక పోతే, మా ఫీజు యాభై నుండీ అరవై లక్షలదాకా ఉంటుంది. అది కట్టేసి ఈరోజే జాయిన్ చేసెయ్యండి" అన్నాడా కాలేజ్ ప్రిన్సిపాల్.

"అం యాభైలక్షలా... చాలా ఎక్కువేమో! అంత కట్టాకా సీటు రాకపోతే" సందేహం వెలిబుచ్చాడు విశ్వనాథం.

"అవునవును" అన్నట్లు బుర్ర ఊపాడు భూషణం.

ఆ మాటలకి ఆ ప్రిన్సిపాల్ చాలా కూల్‌గా నవ్వేస్తూ "మాకు తెలుసు సార్, మీకా డౌట్ వస్తుందనీ. మా దాంట్లో సీట్ గ్యారంటీ అని మీకు మాటల్లో కాదు, పదండి... మేము స్టూడెంట్స్‌కి ఏ విధంగా ట్రైనింగ్ ఇస్తామో చూపిస్తాను. అప్పుడు మీకే తెలుస్తుంది, మేము రీజనబుల్‌గానే ఉన్నామని" అంటూ వాళ్ళిద్దరినీ



తీసుకెళ్ళాడు క్లాస్‌రూమ్స్ దగ్గరికి.

ముందుగా పెద్ద హాల్లోకి తీసుకెళ్ళాడు. అందులో వరుసగా కుర్చీల్లో కూర్చుని ఉన్నారు కొందరు. వారికెదురుగా టీపాయ్‌లు ఉన్నాయి. వాటిమీద నిమ్మకాయలున్న బాస్కెట్స్ ఉన్నాయి. అప్పటికే అక్కడ భూషణం లాంటి పేరెంట్స్ చాలామంది ఉన్నారు. వారినందరినీ ఉద్దేశించి ఆ ప్రిన్సిపాల్ "డియర్ పేరెంట్స్... చూడండి, ఇక్కడ కూర్చున్న వారందరూ చాలా ఎక్సలెంట్ ట్యూటర్స్. మీ పిల్లలకి ఇందులో ఎవరు కావాలీ అనేది పూర్తిగా మీ ఇష్టం, మీరే సెలెక్ట్ చేసుకో వచ్చు. ఎలా సెలెక్ట్ చేసుకోవాలీ అనేది కూడా నేనే చెప్తాను" అని అందులో మొదట కూర్చున్న వ్యక్తి దగ్గరికెళ్ళి అతనికెదురుగా ఉన్న బుట్టలోంచి ఒక నిమ్మకాయని తీసిచ్చాడు. అతను దాన్ని తీసుకుని రెండు చేతుల మధ్యా పెట్టుకుని గట్టిగా నొక్కాడు. దానిలోంచి ఒక రెండు చుక్కల రసం పడింది. ఆ తరవాత కూర్చున్న వ్యక్తి దగ్గరికెళ్ళి నిమ్మకాయల్లోంచి ఒకటి తీసిచ్చాడు. అతను కూడా రెండు చేతుల మధ్యా పెట్టి నిమ్మ కాయని నొక్కాడు. ముందు తీసినతనికన్నా మరో రెండు చుక్కలు ఎక్కువ పడ్డాయి. అలా వరు సగా అందరి దగ్గరికీ వెళుతూ ఆఖరి వ్యక్తి దగ్గరి కొచ్చి నిమ్మకాయ ఇచ్చాడు. అతను నిమ్మకాయని చేతిలో పెట్టుకుని నొక్కగానే సర్రమని బోలెడంత రసం కారిపోయింది. అంతా ఆశ్చర్యపోయారు. ' 'చూశారా, ఇతని టాలెంట్. మీరు ఎలాంటి నిమ్మ కాయనైనా ఇవ్వండి, ఒక్క సెకనులో దానిలోంచి రసం మొత్తం తీసిపారేస్తాడు" అన్నాడు ప్రిన్సిపాల్ గర్వంగా పేరెంట్స్ వైపు చూస్తూ.

భూషణంతో సహా అందరూ సరదాపడి తలా ఒక నిమ్మకాయ ఇచ్చారు. ఎవరెలాంటిది ఇచ్చినా ఒక్క సెకనులో దానిలోని రసంతోపాటూ గుజ్జుని కూడా పిండి పారేస్తున్నాడా ఎక్సలెంట్ ట్యూటర్.

"ఇప్పుడు మీ పిల్లలకి ఏ ట్యూటర్ కావాలో సెలెక్ట్ చేసుకోండి" అన్నాడు ప్రిన్సిపాల్.

అంతా ఆ రసం పిండేసే ట్యూటరే కావాలి అని ఎగబడ్డారు.

దాంతో ఆ ప్రిన్సిపాల్ "అతనే కావాలంటే కచ్చితంగా మీరు ఎక్స్‌ట్రా పే చేయాల్సి ఉంటుంది. సరే పదండి, నెక్స్ట్ మీకు మా హాస్టల్ రూమ్స్ ఏ విధంగా డిజైన్ చేయ బడ్డాయో చూపిస్తాను" అని వాళ్ళని హాస్టల్ రూమ్స్ వైపుకి తీసుకెళ్ళాడు. అవన్నీ నిజంగానే ప్రత్యేకంగా డిజైన్ చేయబడినట్లు గాలీ వెలుతురూ, రాత్రీ పగలూ ఏమీ తేడా తెలీకుండా ఉన్నాయి. వాటిని రూమ్స్ అనేకంటే గుహలు అంటే బావుండేటట్లున్నాయి.

"చూశారా వీటిని, ఇందులో కూర్చుని చదువు కుంటే మీవాడికి రాత్రా పగలా అనే ఆలోచనే రాదు. సో, ఎన్ని గంటలైనా చదువుకుంటూ ఉండిపోవచ్చు. ఫ్లస్ నిద్ర టైమ్ అయ్యిందీ, ఫుడ్ టైమ్ అయ్యిందీ అనేది వాళ్ళ మనసుల్లోకి రాని వ్వకుండా ఇక్కడ వాచ్ అనేది లేకుండా చేస్తాం. ఇన్‌కేస్ వాళ్ళకెప్పుడైనా మరీ ఆపుకోలేనంత నిద్ర వచ్చింది అనుకోండి... అప్పుడు వెళ్ళి పడుకోవచ్చు- అదిగో ఆ బెడ్స్ మీద. కానీ, ఈ బెడ్స్ చూశారా ఎలాగున్నాయో... ఎంత ఒళ్ళు తెలీని నిద్ర వచ్చినా మహా అయితే ఒక గంటో గంటన్నరో మించి దీనిమీద పడుకోలేరు. ఆ విధంగా వీటిని కుట్టించాం" అని చెప్పడం ఆపేసి, ఒకసారి చుట్టూ చూస్తూ "మీకు ఇంకో సీక్రెట్ చెప్పనా... ప్రతీ బెడ్ మీదా కొన్ని నల్లుల్ని కూడా ఎరేంజ్ చేయించాం. హ..హ..హా.." అంటూ గుసగుసగా చెప్పి పగలబడి నవ్వేస్తూ "పదండి, మిమ్మల్ని ఇంకో దగ్గరికి తీసుకెళ్తా" అంటూ ముందుకి నడిచాడు. అక్కడ ఉన్న అయిదు నిమిషాల్లోనే ఒళ్ళంతా చమటలు పట్టేయడంతో రుమాళ్ళతో తుడుచుకుంటూ ఆ గదుల్లోంచి బయటపడ్డారు భూషణం, విశ్వనాథం.

ఈలోగా బైట కారిడార్లో ఒక అబ్బాయి ఏడుస్తూ పై ఫ్లోర్‌లోకి పరిగెట్టేస్తున్నాడు. అది చూసి "ఆ అబ్బాయ్ ఎందుకూ అలా పరిగెడు తున్నాడు?" కంగారుగా అడిగాడు భూషణం.

"ఆ కుర్రాడు సూసైడ్ చేసుకోవడానికి టాప్ ఫ్లోర్‌కి వెళుతున్నాడు" చాలా ఈజీగా, చాలా కూల్‌గా చెప్పాడా ప్రిన్సిపాల్.

"ఓయ్, ఏమంటున్నారు మీరు...మరి పట్టు కోండి ఆ కుర్రాడిని" ఇద్దరూ ఒకేసారి అంటూ ఆ కుర్రాడు పరిగెట్టే వైపు పరిగెత్తబోయారు.



"హలో.. హలో.. కూల్ కూల్... మాకు ఇలాంటివన్నీ మామూలే. అందుకే మా ఏర్పా ట్లలో మేం ఉంటాం. ఒక్క ఫైవ్ మినిట్స్ వెయిట్ చేయండి, వాడే గ్రౌండ్ ఫ్లోర్‌లోంచి వస్తాడు" అని చెప్పాడు చాలా ప్రశాంతంగా ప్రిన్సిపాల్.

అతను చెప్పినట్లుగానే మరో అయిదు నిమిషాల్లో నీరసంగా కింద నుండి మెట్లెక్కి వస్తూ కనిపించాడా కుర్రాడు.

"అదెలాగా, ఆ అబ్బాయికేం కాలేదా?" అడిగాడు భూషణం నమ్మశక్యంకాక.

దానికి చిద్విలాసంగా నవ్వుతూ "మేం ఊరికే మీ దగ్గర నుండీ లక్షలు లక్షలు వసూలు చేస్తామటండీ, ఒకసారి ఇలా వచ్చి చూడండి" అని బాల్కనీలోంచి కిందకి చూపించాడు. చూసి అవాక్కయిపోయారిద్దరూ. కాలేజ్ చుట్టూ బల మైన నెట్స్ కట్టేసి ఉన్నాయి అన్ని వైపులానూ.

"చూశారా మాది ఎంత ముందుచూపో, పిల్లలకి ఏం అవ్వకపోగా లైఫ్‌లో గుర్తుండి పోయేలా ఒక మంచి థ్రిల్లింగ్ ఎక్స్‌పీరియన్స్ కూడా మిగిలిపోతుంది. యామ్ ఐ రైట్ హ..హ.." అంటూ ఆనందంగా నవ్వేస్తూ, వీళ్ళు ఆ షాక్‌లో ఉండగానే కాలేజ్ మెస్‌నీ, బాత్‌రూమ్స్‌నీ, ఇంకా వాళ్ళ స్టడీ రూమ్స్‌నీ అన్నింటినీ చూపించాడా ప్రిన్సిపాల్.

అన్నిటినీ చూసిన తరవాత "మొత్తానికి కడుపు నిండా తిని, కంటినిండా నిద్రపోయే అవకాశం లేదన్నమాట ఇందులో జాయిన్ చేస్తే" రవ్వంత మనసు చివుక్కుమనడంతో భూషణం అన్నాడు ప్రిన్సిపాల్‌తో.

దానికతను "భలేవారే, మీరు ఏ విధంగానైనా మా పిల్లల్ని ఇంజినీరింగ్‌లోనో మెడిసిన్లోనో సీటు వచ్చే విధంగా చెయ్యండి అని మా దగ్గర జాయిన్ చేస్తున్నపుడు, ఇంత ఫీజులు తీసుకుంటు న్నప్పుడు దానికి తగ్గట్టు వంద శాతం న్యాయం చేయాలి కదా మేము. అయినా ఎంత కష్టపడ్డా ఈ రెండేళ్ళే కదా" అన్నాడు.

"సరే నిజమే, ఈ రెండేళ్ళే కష్టపడతారు... ఒప్పుకుంటాను. ఇంత శ్రమపడ్డా వీళ్ళకి సీటు రాకపోతే..?" సందేహం వెలిబుచ్చాడు విశ్వనాథం.

"చాలా తెలివైన ప్రశ్న" మెచ్చుకోలుగా విశ్వనాథం వైపు చూసి అనీ, "ఈ రెండేళ్ళూ వీళ్ళని నిద్రకీ తిండికీ దూరంచేసి పుస్తకాలు మొత్తం బట్టీపట్టించేది ఒక ఎత్తు అయితే, ఆ తరవాత ఎగ్జామ్స్‌లో ర్యాంక్స్ వచ్చేలా చూడటం ఒక ఎత్తు. నిజానికి ఆ ర్యాంక్స్ మీకన్నా మాకే ముఖ్యం. అవన్నీ మీకెందుకు... మీరు ఫీజు కట్టి జాయిన్ చేసేసి, మీవాడి గురించి మర్చిపోండి. మళ్ళీ ఇంజినీరింగ్‌లో సీటు వచ్చాకే వద్దురు" అన్నాడు ధీమాగా ప్రిన్సిపాల్.

దానికి విశ్వనాథం "సరే, మీరు ఎలాగోలాగ సీటిప్పిస్తారు. కానీ, ఏమాత్రం ఆలోచనా అవగాహనా లేకుండా బట్టీపట్టి సీటు తెచ్చుకున్న వీళ్ళు ఆ పైచదువులు చదవలేకపోతే..." అనుమానంగా అన్నాడు.

"ఇది మరీ బావుందండీ, మేం ఫీజు తీసుకునేది ఈ రెండేళ్ళకే. పైగా మా కాలేజీ క్యాంపస్ దాటిన తరవాత వాళ్ళేమైపోతే మాకేమిటి? వాళ్ళ స్థాయేమిటీ వాళ్ళ భవిష్యత్తు ఏమిటీ అనేది బాధ్యతా తెలివీ కల పేరెంట్స్‌గా మీరు ఆలోచించుకోవాలి... కదా" నర్మగర్భంగా నవ్వుతూ అన్నాడా ప్రిన్సిపాల్.

★ ★ ★

"ఏరా, మీవాడిని ఈరోజు జాయిన్ చేసే ద్దామా?" మర్నాడు ఉదయాన్నే కాఫీ తాగుతూ పేపర్ చదువుతూ అడిగాడు విశ్వనాథం భూషణాన్ని.

"ఊహూ... లేదురా, నేను నిజమైన బాధ్యతా, తెలివీ కల తండ్రిగా ఉండదలిచాను. మావాడికి మంచీ చెడూ, కష్టం సుఖం అన్నీ తెలియజెప్పి శక్తిమేరకు వాడేం చదువుకోదలిచాడో వాడి అభిప్రాయాన్ని తెలుసుకుని, ఆపై ఎక్కడ జాయిన్ చేయాలో ఆలోచిస్తాను" అన్నాడు స్థిరంగా భూషణం.

"అయితే ఇంకేం, శుభస్య శీఘ్రం. బాధ్యత కల తండ్రి చేతిలో మరో మరమనిషి కాకుండా ఎంచ క్కని భావిభారత పౌరుడు తయారవ్వబోతున్నా డన్నమాట" అని విశ్వనాథం అనడంతో హాయిగా నవ్వేస్తూ ఊరికి తిరిగి వెళ్ళడానికి బ్యాగ్ సర్దుకోవడానికి సిద్ధమయ్యాడు భూషణం. 

# వైఫల్యాల మ్యూజియం!





**ఆపిల్... గూగుల్... కోక కోలా... ఇలాంటి కంపెనీల పేర్లు వినగానే మనకు స్ఫురించే పదం... విజయం. కానీ ఈ సంస్థలూ విఫలమైన సందర్భాలున్నాయని తెలుసా? ఇటీవల స్వీడన్‌లో ప్రారంభమైన ఓ మ్యూజియం మరుగునపడిన ఆ వైఫల్యాలను వెలికితీసింది. పొరపాట్లు సహజమనీ వాటిని హుందాగా స్వీకరించే ఉత్తమ సంస్కృతిని వ్యవస్థల్లో నెలకొల్పడం అవసరమనీ చెప్పడానికే తామీ ప్రయత్నం చేశామంటున్నారు ఆ మ్యూజియం వ్యవస్థాపకులు.**

హార్లీ డేవిడ్‌సన్ అనగానే ఖరీదైన, మెరిసే బైక్ గుర్తొస్తుంది. ప్రపంచవ్యాప్తంగా ప్రజాదరణ లభించడంతో ఆ కంపెనీ ఉత్పత్తులను విస్తరిస్తూ టీషర్టులు, గ్లోవ్స్, సాక్స్, హెల్మెట్స్ తయారుచేసింది. అవన్నీ బైక్ నడిపేటప్పుడు ధరించేవే కాబట్టి వినియోగదారులు బ్రహ్మరథం పట్టారు. దాంతో కంపెనీ మరొకడుగు ముందుకేసి పెర్ఫ్యూమ్స్ తయారుచేసింది. కానీ అభిమానులకు నచ్చలేదు. సెంట్ పెట్రోల్ వాసన వస్తోందంటూ విమర్శలు వెల్లువెత్తాయి. బ్రాండ్ పేరుకే నష్టం వచ్చే పరిస్థితి కన్పించడంతో ఆ ఉత్పత్తులకు సంస్థ మంగళం పాడక తప్పలేదు.

ఇలా కంపెనీలు తూచ్... అని తయారీ ఉపసంహరించుకున్న ఉత్పత్తులను ప్రదర్శిస్తోంది మ్యూజియం ఆఫ్ ఫెయిల్యూర్స్. వాణిజ్యపరంగా ఘోరంగా విఫలమైన 70కి పైగా ఉత్పత్తులు ఇందులో ఉన్నాయి. కేవలం ప్రదర్శనే కాదు, వాటి చరిత్రా వివరిస్తున్నారు. సృజనాత్మక పరికరాల పరిశోధకుడూ మ్యూజియం వ్యవస్థాపకుడూ డాక్టర్ శామ్యూల్ వెస్ట్ సృజనను గౌరవించడమే తన ఉద్దేశమంటున్నారు. సృజన వెనక ఉండే 'రిస్క్'ని గుర్తించమంటారాయన. వైఫల్యానికి భయపడకుండా దాన్ని అంగీకరించినప్పుడే మరింత సృజనాత్మక ఆవిష్కరణలకు ప్రాణం పోయవచ్చన్నది వెస్ట్ ఉద్దేశం. ఒకవిధంగా సృజనకు వైఫల్యం అవసరం అంటారీయన. 'ఈ మ్యూజియంలో ఉన్న పరికరాలన్నీ సిద్ధాంతపరంగా గొప్ప ఆవిష్కరణలు. ఆచరణలో ఎక్కడో తేడా వచ్చింది. ఆ తేడాని విశ్లేషించుకోగలగాలి. అదే కొత్తగా ఈ రంగంలోకి వచ్చేవారికి నేను చెప్పదలచుకున్న పాఠం...' అంటున్నారు వెస్ట్.

కొత్త ఉత్పత్తుల పేరుతో కొన్నీ బ్రాండ్ విస్తరణ పేరుతో మరికొన్నీ... కంపెనీలు చేతులు కాల్చుకున్న వైనాన్ని కళ్లకు కడుతోంది ఈ మ్యూజియం. అందులో ఉన్న గాడ్జెట్స్‌లో మచ్చుకు కొన్ని...

★ 'దయచేసి ఆ అద్దాలు ధరించిన వారు లోనికి రావద్దు...' ఇలాంటి నోటీస్ బోర్డులు తరచుగా కనబడడం గూగుల్‌కి ఇబ్బందికరంగా మారింది. అదే... 'గూగుల్ గ్లాస్'. రహస్యంగా చిత్రాలు తీసే ఈ గూగుల్ గ్లాస్ ప్రైవసీ ప్రశ్నలు లేవనెత్తింది. దానికి తోడు దీని తయారీ లక్ష్యంలో స్పష్టత లేదు. కళ్లద్దాల్లా ధరించే దీనివల్ల రేడియేషన్ వెలువడడమూ విమర్శలకు తావిచ్చింది. దాంతో దాని తయారీని అటకెక్కించింది గూగుల్.

★ ఒకటిన్నర దశాబ్దం క్రితం మొబైల్, గేమ్స్ విడివిడిగా వేర్వేరు పరికరాల్లో ఉండేవి. అప్పుడు నోకియా ఎన్-గేజ్ పేరుతో ఓ ఫోన్ ప్లస్ గేమ్ గ్యాడ్జెట్‌ని విడుదల చేసింది. అసాధారణ ఆకృతి, ఏమాత్రం సౌకర్యంగా లేని కీబోర్డ్ దానిని వినియోగదారులకు దూరం చేశాయి.

★ ఆపిల్ ఉత్పత్తులంటే నాణ్యతకు పరాకాష్ఠ అనుకుంటాం. కానీ ఒకప్పుడు ఆపిల్ తయారుచేసిన న్యూటన్ అనే పర్సనల్ డిజిటల్ అసిస్టెంట్ వైఫల్యాల జాబితాలో చేరింది. ఈ గాడ్జెట్‌లోని చేతిరాతను గుర్తించే సాఫ్ట్‌వేర్ సరిగా పనిచేయకపోవడం, అధిక ధర దాన్ని వినియోగదారులకు దగ్గర చేయలేకపోయాయి. అయితే ఈ వైఫల్యాన్నే స్టీవ్ జాబ్స్ ఐఫోన్, ఐప్యాడ్‌ల తయారీకి పునాదిగా మార్చుకోవడం విశేషం.

★ ట్విటర్ కొత్తగా ఉన్న రోజుల్లో పీక్ అనే సంస్థ ట్విటర్ పీక్ అనే పరికరాన్ని రూపొందించింది. అది ట్విటర్ మాత్రమే చూసుకోడానికి పనికొచ్చేదన్నమాట. ఆ మాత్రం దానికి 200 డాలర్లు దండగనుకున్న జనాలు దాన్ని కొనలేదు. ఇదే సంస్థ అంతకుముందు ఈ మెయిల్స్ పంపే ఓ పరికరాన్నీ తయారుచేయగా అదీ అట్టర్‌ఫ్లాపే. దాంతో సంస్థ ఇలాంటి ఉత్పత్తుల తయారీనుంచి తప్పుకొని క్లౌడ్ సాంకేతికతవైపు మళ్లింది.

★ కొడాక్... ఒకప్పుడు కెమెరాలకు ప్రత్యామ్నాయంగా ఉండేదీ పేరు. 1995లో ఈ సంస్థ డీసీ 40 అనే మోడల్ డిజిటల్ కెమెరాను విడుదల చేసింది. ఆ తర్వాత కొన్నేళ్లకే సంస్థ దివాలా తీయడానికి కారణం ఆ కెమెరానే నంటారు. ఆన్‌లైన్ ఫొటో షేరింగ్ విస్తృతిని అంచనా వేయలేకపోవడమే కారణం.

★ ఇలాంటి పొరపాటే 70వ దశకంలో సోనీ కూడా చేసింది. వీసీఆర్‌కి ప్రత్యామ్నాయంగా సోనీ తెచ్చిన బీటామ్యాక్స్.. వీడియో రెంటల్ మార్కెట్‌ని అందిపుచ్చుకోలేకపోయింది. దాంతో మార్కెట్లో సోనీ వాటా అప్పుడు అమాంతం పడిపోయింది.

★ 1984లో కోకకోలా కంపెనీ క్లాసిక్ కోక్ స్థానంలో న్యూ కోక్ (కోక్ 2) పేరుతో కొత్త కోక్‌ని ప్రవేశపెట్టింది. కొద్ది రోజులకే వినియోగదారులు పాత కోక్‌ని తిరిగి తెస్తారా లేదా అని డిమాండ్ చేశారు. దాంతో క్లాసిక్ కోక్‌ని తిరిగి తెచ్చింది. అదే సంస్థ 2006లో కాఫీ ఫ్లేవర్‌తో విడుదల చేసిన కోక్ బ్లాక్ సోడా రుచి ఏమాత్రం బాగోలేదన్న విమర్శ రావడంతో రెండేళ్లకే తయారీ నిలిపేసింది.

★ సంబంధం లేని రంగంలో అడుగుపెడితే ఏమవుతుందో కాల్గేట్ అనుభవంతో తెలుసుకుంది. రాత్రిపూట కోల్గేట్‌తో దంతధావనం చేసుకునే ముందు బ్రాండెడ్ ఫ్రోజెన్ డిన్నర్‌లను తినమంటూ వాటిని మార్కెట్లో ప్రవేశపెట్టింది ఈ సంస్థ. వండి తినడానికి సిద్ధంగా ఉన్న ఆహారాన్ని ఫ్రీజ్ చేసి సరఫరా చేసింది. 1980ల్లో ఈ కాన్సెప్ట్ జనాలకు నచ్చలేదు. కోల్గేట్ వెనక్కి తగ్గక తప్పలేదు. ★



# మస్త్... మస్త్... మసాలా కూర!




### కావలసినవి

**బోన్‌లెస్ చికెన్:** అరకిలో, **పెరుగు:** అరకప్పు, **నిమ్మరసం:** టీస్పూను, **పసుపు:** అరటీస్పూను, **కారం:** అరటీస్పూను, **మిరియాల పొడి:** అరటీస్పూను, **గరంమసాలా:** అరటీస్పూను, **ఉప్పు:** చిటికెడు, **గ్రేవీకోసం: నూనె:** టేబుల్‌స్పూను, **వెన్న:** టేబుల్‌స్పూన్లు, **యాలకులు:** మూడు, **లవంగాలు:** రెండు, **దాల్చినచెక్క:** అంగుళంముక్క, **ఉల్లిపాయ:** ఒకటి, **ఉప్పు:** తగినంత, **అల్లంవెల్లుల్లి:** 2 టేబుల్‌స్పూన్లు, **దనియాలపొడి:** 2 టీస్పూన్లు, **జీలకర్ర:** టీస్పూను, **కారం:** అరటీస్పూను, **టొమాటోలు:** నాలుగు, **టొమాటోగుజ్జు:** 2 టేబుల్‌స్పూన్లు, **మంచినీళ్లు:** కప్పు, **పంచదార:** టేబుల్‌స్పూను, **గరంమసాలా:** అరటీస్పూను, **క్రీమ్:** కప్పు, **కొత్తిమీర:** కొద్దిగా

### తయారుచేసే విధానం

★ పెరుగులో నిమ్మరసం, పసుపు, కారం, మిరియాలపొడి, గరం మసాలా, ఉప్పు వేసి కలిపి చికెన్ ముక్కలకు పట్టించి ఉంచాలి.

★ విడిగా బాణలిలో నూనె, వెన్న వేసి కాగాక కాస్త కచ్చాపచ్చాగా దంచిన యాలకులు, లవంగాలు, దాల్చినచెక్క వేసి వేయించాలి. తరవాత ఉల్లిముక్కలు, ఉప్పు వేసి వేగాక అల్లంవెల్లుల్లి వేసి ఓ నిమిషం వేయించాలి. ఇప్పుడు దనియాలపొడి, జీలకర్ర, కారం, టొమాటో ముక్కలు, టొమాటోగుజ్జు వేసి నూనె తేలేవరకూ ఉడికించాలి.

★ తరవాత చికెన్ ముక్కలు వేసి కాసేపు ఉడికించాలి. ఇప్పుడు గరం మసాలా, పంచదార వేసి తగినన్ని నీళ్లు పోసి మూతపెట్టి సుమారు ఇరవై నిమిషాలపాటు ముక్క మెత్తగా ఉడికేవరకూ ఉంచాలి. చివరగా క్రీమ్ వేసి దించి కొత్తిమీరతో అలంకరించాలి.




### కావలసినవి

**చేపముక్కలు:** కిలో, **కారం:** 2 టేబుల్‌స్పూన్లు, **పచ్చిమిర్చి:** నాలుగు, **నూనె:** అరకప్పు, **కొత్తిమీర:** కట్ట, **మంచినీళ్లు:** 2 కప్పులు, **చింతపండురసం:** 2 కప్పులు, **కరివేపాకు:** 3 రెబ్బలు, **ఉల్లిపాయలు:** రెండు, **అల్లంవెల్లుల్లి:** 4 టేబుల్‌స్పూన్లు, **పసుపు:** టీస్పూను, **ఉప్పు:** తగినంత, **దనియాలపొడి:** టేబుల్‌స్పూను

### తయారుచేసే విధానం

★ చేపముక్కల్ని ఉప్పు, పసుపు వేసి కడిగి తరవాత కాస్త ఉప్పు, పసుపు పట్టించి పక్కన ఉంచాలి.

★ చింతపండుని ఓ గంటముందే గోరు వెచ్చని నీళ్లలో నానబెట్టి రసం పిండాలి.

★ మందపాటి గిన్నెలో ఉల్లిముక్కలు, అల్లంవెల్లుల్లి, కారం, ఉప్పు, పసుపు, దనియాలపొడి, చింతపండు రసం, నీళ్లు పోసి, కొత్తిమీర తురుము, కరివేపాకు వేసి కలపాలి. ఓసారి ఉప్పూకారం సరిచూసి, చాలకపోతే మరికాస్త వేసి కలపాలి. ఇప్పుడు ఈ మిశ్రమం మీద తేలినట్లుగా నూనె వేసి మరిగించాలి. తరవాత మంట తగ్గించి సిమ్‌లో పావుగంటసేపు ఉడికించాలి. గ్రేవీ చిక్కబడి దాదాపుగా ఉడికింది అనుకున్నాక చేపముక్కలు, పచ్చిమిర్చి వేసి మరో పది నిమిషాలు సిమ్‌లో ఉడికించాలి. ముక్కల్ని కదపకుండా ఓసారి ఫోర్కుతో ఉడికిందో లేదో చూసి స్టవ్ ఆఫ్ చేసి కొత్తిమీరతో అలంకరిస్తే సరి.




### కావలసినవి

**రొయ్యలు:** అరకిలో, **ఉల్లిపాయలు:** రెండు, **అల్లంవెల్లుల్లి:** 2 టీస్పూన్లు, **టొమాటో:** ఒకటి, **కరివేపాకు:** 2 రెబ్బలు, **ఆవాలు:** అరటీస్పూను, **పసుపు:** పావుటీస్పూను, **కారం:** 2 టీస్పూన్లు, **దనియాలపొడి:** 2 టీస్పూన్లు, **గరంమసాలా:** అరటీస్పూను, **మిరియాలపొడి:** పావుటీస్పూను, **నిమ్మరసం:** అరటీస్పూను, **నూనె:** టేబుల్‌స్పూను, **ఉప్పు:** తగినంత




### తయారుచేసే విధానం

★ రొయ్యల్ని శుభ్రంగా కడగాలి. ఉప్పు, మిరియాల పొడి, నిమ్మరసం వేసి కలిపి పక్కన ఉంచాలి.

★ విడిగా బాణలిలో నూనె వేసి కాగాక ఆవాలు, కరివేపాకు వేసి వేయించాలి. తరవాత ఉల్లిముక్కలు వేసి వేగాక టొమాటో ముక్కలువేసి అవి ఉడికేవరకూ ఉంచి, పసుపు, కారం, దనియాలపొడి, గరంమసాలా వేసి కలిపి నూనె తేలేవరకూ వేయించాలి. ఇప్పుడు అన్నీ పట్టించి పక్కన ఉంచిన రొయ్యలు వేసి రెండు నిమిషాలపాటు మసాలా రొయ్యలకు పట్టేవరకూ వేయించి, కొద్దిగా నీళ్లు పోసి, ఉప్పు వేసి సిమ్‌లోనే మూతపెట్టి ఉడికించాలి. చివరగా కొత్తిమీర తురుము, నిమ్మముక్కలతో అలంకరిస్తే సరి.

### కావలసినవి

**మటన్:** అరకిలో, **ఉల్లిపాయలు:** రెండు, **నూనె:** 3 టేబుల్‌స్పూన్లు, **అల్లం వెల్లుల్లి:** టేబుల్‌స్పూను, **ఉప్పు:** రుచికి సరిపడా, **కారం:** టేబుల్‌స్పూను, **పసుపు:** అరటీస్పూను, **దనియాలపొడి:** టేబుల్‌స్పూను, **జీలకర్రపొడి:** టీస్పూను, **టొమాటోలు:** రెండు, **పెరుగు:** కప్పు, **కొత్తిమీర తురుము:** 2 టేబుల్‌స్పూన్లు, **మటన్ మసాలా:** టీస్పూను, **గరంమసాలా:** అరటీస్పూను




### తయారుచేసే విధానం

★ మటన్ ముక్కలను శుభ్రంగా కడిగి, అందులో కొద్దిగా నూనె, ఉప్పు వేసి పది నిమిషాలు ఉడికించాలి.

★ ప్రెషర్ పాన్‌లో నూనె వేసి ఉల్లిముక్కలు వేసి వేగాక, అల్లంవెల్లుల్లి వేసి వేయించాలి. తరవాత మటన్ ముక్కలు వేసి ఓ రెండు నిమిషాలు వేయించాలి. ఇప్పుడు ఉప్పు, కారం, పసుపు, దనియాలపొడి, జీలకర్ర, మటన్ మసాలా పొడి వేసి రెండు నిమిషాల పాటు సిమ్‌లో ఉడికించాలి. తరవాత సన్నగా కోసిన టొమాటో ముక్కలు వేసి అవి ఉడికాక పెరుగు వేసి కలపాలి. నూనె తేలే వరకూ ఉడికించి, కొద్దిగా నీళ్లు, కొత్తిమీర తురుము వేసి మూతపెట్టి సిమ్‌లో ముక్కలు మెత్తగా అయ్యేవరకూ ఉడికించాలి. చివరగా గరంమసాలా, మరికాస్త కొత్తిమీర చల్లి దించాలి.

మరిన్ని వంటల కోసం www.eenadu.net లోని రుచులు పేజీ చూడండి.




## టీచరు కొడుతున్నారు

**బన్నీ:** డాడీ, నువ్వు ఎక్కువ చదువుకున్నావా, మమ్మీనా?

**డాడి:** నేనే... నీకెందుకు డౌటొచ్చింది?

**బన్నీ:** నువ్వు హోమ్‌వర్క్ చేయించినపుడల్లా తప్పులొస్తున్నాయని టీచర్ నన్ను కొడుతుంటేను...

## కోటలోనే బడి...!

పగడాల దీవిలో ముత్యాల కోట. ఆ కోటలో ఓ అందాల రాకుమారి. ఆమె రంగురంగుల పువ్వులు ఉన్న పెద్ద పూలతోటలో విహరిస్తుంది. చిలుకలూ, పావురాలతో కమ్మని కబురులెన్నో చెబుతుంది. లేడిపిల్లలతో పరుగులు పెడుతుంది... ఇలాంటి చందమామ కథలను వినడమంటే చిన్నారులకు ఎంతిష్టమో చెప్పలేం. కథల్లో మాదిరిగానే పిల్లలకూ కోటలోకి వెళ్లే అవకాశం కల్పిస్తే వాళ్లెంత సంతోషిస్తారో కదా. అందుకే మాస్కోలోని ఈ కిండర్‌గార్టెన్ స్కూల్‌ని కోట ఆకారంలో నిర్మించారు. దీంట్లో నూటయాభై మంది పిల్లలు హాయిగా ఆడుకోడానికి అన్ని రకాల ఏర్పాట్లూ చేశారు. ఈ స్కూల్ డైరెక్టర్ పావెల్ గ్రూడినిన్ పిల్లలు బడికి వెళ్లడానికి మారాం చేయకుండా సంతోషంగా వెళ్లాలనే ఇలా నిర్మించాడట. ఆయన ఒకసారి జర్మనీ వెళ్లినపుడు అక్కడ కోట ఆకారంలో ఉన్న స్కూలును చూసి ముచ్చటపడి మాస్కోలో దీన్ని కట్టాడట.





## జతపరచండి

ఈ గాలిపటాలను వాటి దారపు కండెలతో జతపరచండి.




## విభజించండి

ఈ చదరంలో నాలుగు రకాల బొమ్మలు ఉన్నాయి కదా. వాటిని నాలుగు భాగాలుగా విభజించాలి. ప్రతి భాగంలోనూ నాలుగు రకాల బొమ్మలూ రావాలి. ప్రయత్నించండి.



## చెప్పగలరా?

ఇక్కడున్న బొమ్మల పేర్లను ఆంగ్లంలో రాయండి. ఆ పేర్లలోని మొదటి అక్షరాలను ఒక క్రమంలో పెడితే ఒక ఇంగ్లిష్ నెల పేరు వస్తుంది. అదేమిటో చెప్పండి.



## తేడాలేంటి?

ఈ రెండు బొమ్మల మధ్య ఉన్న ఎనిమిది తేడాలు చెప్పండి.





## సన్మానం

బీర్బల్ ఎంతో తెలివైనవాడు. తన తెలివితేటలూ, హాస్య చతురతలను ప్రదర్శించి అక్బర్ కొలువులో స్థానం సంపాదించాడు. రోజూ ఏదో ఒక తమాషా చేస్తూ అక్బర్‌ను నవ్వించేవాడు. ఒకసారి బీర్బల్‌తో 'నువ్వు ప్రదర్శించే హాస్య చతురత మమ్మల్ని ఎంతో ఆనందింపజేస్తుంది. పండగ పర్వదినాల్లో నిన్ను మణులూ, మాణిక్యాలతో సన్మానించాలని నిర్ణయించాం' అని సభాముఖంగా ప్రకటించాడు అక్బర్. రోజులు గడిచిపోయాయి.

పండగ వచ్చి వెళ్లిపోయిందికానీ బీర్బల్‌ని సన్మానించలేదు. దాంతో బీర్బల్ ఎంతో నిరుత్సాహపడ్డాడు. ఎలాగైనా అక్బర్‌కు ఈ విషయం గుర్తు చేయాలనుకున్నాడు కానీ కుదరలేదు.

ఒకసారి అక్బర్ చక్రవర్తి బీర్బల్‌ను తీసుకుని కోట బయట ఉన్న తోటలోకి షికారుకు వెళ్లాడు. ఆ పక్క నుంచి ఓ ఒంటె వెళుతోంది. దాని మెడ వంకరగా ఉండటం గమనించిన అక్బర్ 'ఈ ఒంటె మెడ ఎందుకంత వంకరగా ఉందో చెప్పగలవా?' అని బీర్బల్‌ని అడిగాడు. అవకాశం దొరికినందుకు ఎంతో సంతోషించిన బీర్బల్ 'బహుశా అది ఇచ్చిన మాట నిలబెట్టుకోలేదేమో జహాపనా' అన్నాడు. 'అర్థంకాలేదు, కాస్త వివరంగా చెప్పు' అన్నాడు అక్బర్. 'ఇచ్చిన మాట నిలబెట్టుకోని వాళ్ల మెడ వంకర తిరుగుతుందని పెద్దలు చెబుతుంటారు. మీరెప్పుడూ వినలేదా జహాపనా' అన్నాడు ఎంతో వినయంగా. 'ఈ మాట నేనెప్పుడూ వినలేదే, భలే చిత్రంగా ఉంది' అనుకుని తను ఎవరెవరికి ఏయే వాగ్దానాలు చేసిందీ గుర్తుతెచ్చుకున్నాడు అక్బర్. బీర్బల్ సన్మాన విషయం కూడా గుర్తొచ్చింది. అప్పుడుగానీ అక్బర్‌కు అసలు విషయం అర్థంకాలేదు. 'నీ ఆంతర్యం అర్థమైంది బీర్బల్. రేపే నీ సన్మానానికి ఏర్పాటు చేయిస్తాను. సమయస్ఫూర్తితో నా బాధ్యతను గుర్తుచేసినందుకు అభినందనలు' అన్నాడు అక్బర్ నవ్వుతూ.

## దాగుడుమూతలు

ఈ బొమ్మలో పక్షి, హృదయాకారం, పడవ, డాల్ఫిన్, పెయింట్ బ్రష్, పుస్తకం, పాము, క్యారట్, గ్లాసు, జగ్గు ఉన్నాయి. కనిపించాయా?



## ఏది భిన్నం?

ఈ సీతాకోకచిలుకల్లో అన్నిటికీ జతలు ఉన్నాయి, ఒకదానికి తప్ప. ఆ ఒక్కటీ ఏది?

1 2 3 4 5 6 7

## రంగులేద్దాం

## జవాబులు

**తేడాలేంటి?:** 1. చెట్టు తొర్రలోని పక్షి 2. టోపీ మీద డిజైన్ 3. స్ట్రా వంపు 4. అమ్మాయి హెయిర్‌బ్యాండ్ 5. బకెట్ హ్యాండిల్ 6. నీటి వెనక ఉన్న చెట్టు 7. తెరచాప దిశ 8. కుడివైపు చెట్టు మీద పండ్లు.

**చెప్పగలరా?:** AUGUST(Apple, Uniform, Grapes, Umbrella, Ship, Teddy bear).

**జతపరచండి:** 1-D, 2-E, 3-A, 4-B, 5-C.

**దాగుడుమూతలు:** ఎడమవైపు కింద ఉన్న మొదటి పెంగ్విన్ రెక్కలో పక్షి, మొదటి, రెండు పెంగ్విన్ల మధ్యలో హృదయాకారం, అదే వరుసలోని చివరి పెంగ్విన్‌లో మగ్గు, వాటి ముందు ఉన్న ఇసుకలో క్యారట్, కుడివైపు ఉన్న పెంగ్విన్ రెక్కలో డాల్ఫిన్, నీటి అలల్లో పడవ, పడవ వెనకే పాము, ఒడ్డు అంచులో పుస్తకం, పెయింట్ బ్రష్, పైవైపు ఉన్న రెండు, మూడు పెంగ్విన్ల మధ్యలో గ్లాసు ఉన్నాయి.

**విభజించండి**

**ఏది భిన్నం?:** 3 (1-5, 2-4, 6-7).



గార్ని... ప్రాచీన ఆలయం!

# అక్కడి పాఠశాలల్లో చదరంగం తప్పనిసరి!





కొండరాళ్లలో నిర్మించిన గెగార్డ్ చర్చి!

**'ఆకాశాన్ని తాకుతున్నట్లుండే అరారత్ పర్వతశ్రేణినీ, పురాతన కాలం నుంచీ మనుషులు నివసిస్తోన్న గులాబీ నగరాన్నీ, ప్రపంచంలోనే క్రైస్తవాన్ని అధికారికంగా తీసుకున్న తొలి దేశాన్నీ, మొట్టమొదటి చర్చి నిర్మాణాన్నీ, చదరంగాన్ని పాఠ్యాంశంగా బోధించే స్కూళ్లనీ ప్రత్యక్షంగా చూడాలంటే అర్మేనియాను సందర్శించి తీరాల్సిందే' అంటున్నారు ఆ దేశాన్ని ఈమధ్యే సందర్శించిన దుబాయ్ నివాసి రాజేష్ వేమూరి.**

హైదరాబాద్‌లోని అబిడ్స్‌కు ఆ పేరు ఎలా వచ్చిందో తెలుసా... ఏడో నిజాం కాలంలో అర్మేనియాకి చెందిన ఆల్బర్ట్ అబిడ్ అనే వ్యక్తి అక్కడ ఓ దుకాణం నడపడంతో ఆ ప్రాంతాన్ని అబిడ్ షాపు అని పిలిచేవారట. అదే కాలక్రమంలో అబిడ్స్‌గా మారింది. ఆవిధంగా మన తెలుగునేలతోనూ కొంత అనుబంధం ఏర్పరచుకున్న ఆ అర్మేనియాని చూడాలని దుబాయ్ నుంచి ప్రయాణమై, ఆ దేశ రాజధాని నగరమైన యెరవాన్‌కి చేరుకున్నాం. ప్రపంచంలోనే అత్యంత పురాతన నగరాల్లో యెరవాన్ ఒకటి. 2800 ఏళ్ల చరిత్రను నింపుకున్న ఈ నగరం ఎన్నో ఆటుపోట్లను తట్టుకుని నిలబడింది. ముందుగా అక్కడ ఉండటానికి అవసరమైన వీసా ఫీజు చెల్లించి, కరెన్సీని అర్మేనియా డ్రాముల్లోకి మార్చుకుని, ట్రావెల్ ఏజన్సీ ఏర్పాటుచేసిన మినీ బస్సులో బయలుదేరాం.

ఐదు వేల సంవత్సరాల చరిత్ర కలిగిన అర్మేనియా జనాభా ప్రస్తుతం 30 లక్షలు కాగా, అందులో సగం నగరంలోనే నివసిస్తున్నారు. చిత్రంగా ప్రపంచవ్యాప్తంగా ఇతర ప్రాంతాల్లో నివసించే అర్మేనియన్ల సంఖ్య 80 లక్షలు. ఆదినుంచీ ఎన్నో ఒడుదొడుకులు ఎదుర్కోవడంతో ఈ దేశం నుంచి ప్రజలు దఫదఫాలుగా వలస వెళ్లిపోయారు. మన అబిడ్స్ వాసి కూడా అలా వచ్చినాయనే.

బైబిలు ప్రకారం- జలప్రళయం సమయంలో నోవా అనే పెద్దాయన కొన్ని ప్రాణులను నౌకలో ఉంచి రక్షించగా, ఆ నౌక అరారత్ కొండల్ని చేరిందని అర్మేనియన్లు నమ్ముతారు. అలా అప్పటినుంచీ అక్కడ నివసిస్తోన్న అర్మేనియన్లు ఓ ప్రత్యేక సంతతిగా గుర్తింపు పొందారు. ఆ దేశంలో 97 శాతం మంది అర్మేనియన్లే. మిగిలిన కొద్దిశాతంలో కుర్దులూ, రష్యన్లూ, ఉక్రెయినీలు ఉన్నారు. అందుకే ఒకే తెగకు చెందిన దేశం ప్రపంచంలో ఇదొక్కటే. అరారత్ పర్వతాల ఒడిలో ఉన్నట్లు ఉండే అర్మేనియా దేశానికి తీర ప్రాంతం లేదు. టర్కీ, జార్జియా, ఇరాన్, అజర్‌బైజాన్ దేశాల మధ్యలో ఉన్న ఈ దేశానికి అక్కడి పర్వత ప్రాంతాల్లో దొరికే రాగి, బంగారం, తగరం... వంటి ఖనిజాలే ప్రధాన ఆదాయ వనరులు. ఒకప్పుడు దేశంలో భాగంగా ఉండి, జాతీయ చిహ్నంగా ఉన్న అరారత్ పర్వతాలు ప్రస్తుతం టర్కీలో ఉన్నాయి. కానీ ఇప్పటికీ అర్మేనియన్లు వాటినే తమ జాతీయ చిహ్నంగా భావిస్తారు.

### *గులాబీ నగరంలో..!*

విమానాశ్రయం నుంచి మా బస్సు నగరం వైపు ప్రయాణిస్తోంది... అక్కడి ఇళ్లన్నీ గులాబీ, లేత పసుపురంగుల్లో ఉన్నాయి. అక్కడ దొరికే టాఫ్ అనే ప్రత్యేకమైన రాయితోనే ఇళ్లు కట్టడాలూ నిర్మిస్తారని బస్సులోని గైడ్ చెప్పింది. అగ్నిపర్వత లావాలోనుంచి ఏర్పడిన ఈ రాయి, ఆ రెండు రంగుల్లోనే ఎక్కువగా లభిస్తుందట. ఆది నుంచీ ఈ రాయినే నిర్మాణానికి వాడుతున్నారు. భారీ కర్మాగారాల నుంచి చిన్న ఇళ్లవరకూ సిమెంట్‌గానీ సున్నంగానీ వేయరు. రాళ్లను వరసగా పేర్చి అవి అతుక్కోవడానికి మాత్రమే సిమెంటుని వాడతారు. వేసవిలో చల్లగా చలికాలంలో వెచ్చగా ఉండటం ఈ రాయి ప్రత్యేకతట. భవంతులన్నీ ఎక్కువగా గులాబీ రంగులో ఉండటంతో యెరవాన్‌కి గులాబీ నగరం అని పేరు.

అలా ప్రయాణిస్తూ యెరవాన్ రైల్వేస్టేషన్‌కీ, తరవాత రిపబ్లిక్ స్క్వేర్‌కీ చేరుకున్నాం. అప్పటికే సాయంత్రం కావడంతో కూడలి ఎంతో సందడిగా ఉంది. దీని నిర్మాణం 1926నుంచి 1977 వరకూ కొనసాగిందట. మొదట్లో దీన్ని లెనిన్ స్క్వేర్‌గా పిలిచేవారు. సోవియట్ నుంచి స్వతంత్రం లభించాక అక్కడి లెనిన్ విగ్రహాన్ని తొలగించి కూడలికి పేరు మార్చారు. నగరంలో తిరిగే కార్లూ టాక్సీలూ అన్నీ పాతవే. చిన్న కార్లే. విలాసవంతమైనవీ పెద్దవీ ఎక్కడా కనిపించవు.

తరవాత విక్టరీ పార్కుకి తీసుకెళ్లారు. రెండో ప్రపంచయుద్ధ సమయంలో అర్మేనియా దళాలు రష్యా తరపున యుద్ధం చేశాయి. దాంతో ఆ గెలుపునకు గుర్తుగా ఈ ఉద్యానవనాన్ని నిర్మించారు. అక్కడ పలు యుద్ధాల్లో భర్తలకు సహకరించిన అర్మేనియా మహిళలకు గుర్తుగా 'మదర్ ఆఫ్ అర్మేనియా' విగ్రహాన్నీ ప్రతిష్ఠించారు. అప్పటికే



సెవాన్... సాగరాన్ని తలపించే అతిపెద్ద సరోవరం

చలిగాలులతో సన్నటి వర్షం మొదలవడంతో ఆరోజు పర్యటన ముగించుకుని కాస్కన్ అనే హోటల్‌కి వెళ్లిపోయాం.

### కొండమీద కొలను!

మర్నాడు ఉదయం లేక్ సెవాన్ అనే మంచినీటి సరస్సుకి చేరుకున్నాం. ఇది సముద్రమట్టానికి 6,250 అడుగుల ఎత్తులో ఉన్న రెండో అతిపెద్ద మంచినీటి సరస్సు. మొదటిది లాటిన్ అమెరికాలోని టిటికాకా సరస్సు. ఇది బొలీవియాలో ఉంది. యెరవాన్ నుంచి సెవాన్‌కి 80 కిలోమీటర్లు. దాదాపు రెండు గంటల ప్రయాణం. ఉష్ణోగ్రత 10 డిగ్రీలు ఉండటంతో చల్లగా ఉంది. మేం ప్రయాణించిన రెండు గంటల్లోనే చలి, వర్షం, ఎండ... ఇలా వెంట వెంటనే వాతావరణం మారిపోవడం ఆశ్చర్యంగా అనిపించింది. అక్కడ వేసవి జూన్ నుంచి సెప్టెంబరు. అప్పుడు కూడా ఉష్ణోగ్రతలు 22 - 36 డిగ్రీల సెల్సియస్‌కి మించవు. యెరవాన్ నుంచి సెవాన్‌కి మీటర్‌గేజ్ రైలు సౌకర్యం కూడా ఉంది. అది చాలా పెద్ద సరస్సు కావడంతో గాలుల తాకిడికి సముద్రంలో మాదిరిగా అలలు వస్తున్నాయి. బస్సు దిగేసరికి చలిగాలి తీవ్రంగా ఉండటంతో ఓ రెస్టరెంటులోకి వెళ్లి కూర్చున్నాం. కాసేపటికి ఆ గాలుల ధాటికి రెస్టరెంటు అద్దాలు భళ్లున పగిలిపోయాయి. అదృష్టవశాత్తూ ఆ అద్దాల పక్కన అప్పుడెవరూ లేరు.

ఆ సరస్సు ఎదురుగా కొండపైన ఓ పురాతన చర్చి ఉంది. అక్కడినుంచి సరస్సు మొత్తం కనిపిస్తుందట. కానీ మా బాబు పసివాడు కావడంతో మేం అక్కడికి వెళ్లే సాహసం చేయలేదు. గాలి ఉధృతి తగ్గాక సరస్సు ముందు ఫొటోలు తీసుకున్నాం. చలికాలంలో ఇది గడ్డకట్టుకుపోతుందట. అక్కడి చేపల వనరుకి ఈ సరస్సే ప్రధాన ఆధారం. భోజన సమయానికి అక్కడే ఉన్న మరో రెస్టరెంట్‌కి వెళ్లాం. సెవాన్ సరస్సులో అనేక రకాల చేపలు దొరుకుతాయి. వాటిల్లో సెగా అరుదైనది. అది చాలా రుచిగా ఉంటుందని మా గైడ్ చెప్పడంతో దాన్ని రుచి చూశాం. నిజంగానే వాసన లేకుండా ఎంతో బాగుంది.

### గార్ని... ఓ పురాతన ఆలయం!

తరవాత సెవాన్‌కి 75 కిలోమీటర్ల దూరంలోని గార్ని అనే పట్టణానికి వెళ్లాం. ఇది అర్మేనియా రాజుల వేసవి విడిది. అక్కడే క్రీ.పూ. నాటి అర్మేనియా దేవాలయం ఉంది. 2100 సంవత్సరాలనాటి ఆ నిర్మాణాన్ని చూడాలంటే మాత్రం 2 డాలర్ల రుసుము చెల్లించాలి. ఆ దేశంలో మిగిలిన ఏ సందర్శనీయ స్థలానికీ రుసుము లేదు, యునెస్కో గుర్తింపు ప్రదేశాలకు తప్ప. ఆలయం లోపల ఓ రాతిపీఠం మాత్రం ఉంది. ఈ నిర్మాణం చుట్టూ ఉండే 24 స్తంభాలు 24 గంటలని సూచిస్తాయట. ఆ దేశంలో గ్రీకు, రోమన్ శైలిలో నిర్మించిన ఏకైక నిర్మాణం ఇది. దొరికిన ఆధారాల ప్రకారం క్రీ.పూ. 77వ సంవత్సరంలో నిర్మించారనేది ఓ అంచనా. అయితే ఇది ఆలయం కాదనీ కేవలం సమాధి మాత్రమే అన్న మరో చారిత్రక వాదనా ఉంది. దీనికి పక్కనే నేలమాళిగలో రోమన్ పవిత్ర స్నానానికి సంబంధించిన గదులు ఉన్నాయి. వాటిని కూడా చూశాక, గెగార్డ్ అనే చర్చికి వెళ్లాం. కానీ ఇందులో మూడు వేర్వేరు చర్చిలు ఉన్నాయి. చిత్రంగా ఇవన్నీ ఒకే రాతిలో తొలిచిన నిర్మాణాలు. వెలుతురు కోసం వెంటిలేటర్లనీ నిర్మించారు. అక్కడ నుంచి బయటకు వస్తుంటే డ్రైనట్స్‌ని ఒక లాంటి హల్వాలో ముంచి తయారుచేసిన సుజుక్ అనే క్యాండీలని అమ్ముతున్నారు. మంచి పోషకభరితమైన ఈ క్యాండీలని యుద్ధ సైనికులు వెంట తీసుకెళ్లేవారట. మర్నాడు మా బృందంలో కొందరు అరారత్ పర్వతాల దగ్గరకు వెళితే, అక్కడ నివసిస్తున్న మా మిత్రులు ఏర్పాటుచేసిన ట్యాక్సీలో మేం నగర పర్యటనకు బయలుదేరాం.


భార్యతో వ్యాసకర్త
ఎచమియాజిన్... తొలి క్రైస్తవ ప్రార్థనామందిరం!

క్రీస్తు ప్రధాన శిష్యులైన దాడియస్, బొర్లోలోమేవ్‌ల ప్రభావంతో క్రీ.శ. 301 సంవత్సరంలోనే అర్మేనియన్లు క్రైస్తవమతాన్ని స్వీకరించారు. తద్వారా ప్రపంచంలోనే మొదటి అధికారిక క్రైస్తవ మత దేశంగా ఇది గుర్తింపు పొందింది. మేం బస చేసిన హోటల్ నుంచి యెరవాన్ నగరం మీదుగా గంట ప్రయాణించి గతంలో పాగన్ దేవాలయం ఉన్న వాఘర్‌షపత్ అనే ప్రాంతంలో కట్టిన ఎచమియాజిన్ క్యాథెడ్రల్‌ను చూడ్డానికి బయలుదేరాం. ఇది ప్రపంచంలోనే తొలి క్రైస్తవ ప్రార్థనామందిరం. అక్కడకు కొద్దిదూరంలోనే మరో చారిత్రక క్యాథెడ్రల్ కూడా చూసి, నగరం మధ్యలో నేలమాళిగలో ఉన్న ఓ అత్యాధునిక రెస్టరెంట్‌లో భోజనం చేశాం.

### అతిపెద్ద మానవ హననం!

తరవాత జెనోసైడ్ మ్యూజియానికి వెళ్లాం. 16వ శతాబ్దం నుంచి 19వ శతాబ్దం వరకూ అర్మేనియాలో కొంత భాగం ఒట్టోమన్ సామ్రాజ్యంలో భాగంగా ఉండేది. దీన్ని టర్కిష్ అర్మేనియా అనేవారు. ఆ సమయంలో రష్యా-పర్షియా యుద్ధాలు జరుగుతుండేవి. వాటిల్లో కొందరు రష్యన్లకు అనుకూలంగా ఉన్నారనే నెపంతో 1895-1920 వరకూ దఫదఫాలుగా టర్కీ పాలకులు అక్కడివారిని మట్టుబెట్టారు. అత్యధికంగా 1915-20 కాలంలో దాదాపు 15 లక్షల మందిని చంపేశారు. అందులో భాగంగా సిరియా ఎడారిలో లక్షల మందిని నడిపించి చంపేశారట. ఆనాటి హత్యల ఆనవాళ్లుగా శవాలూ, పుర్రెల ఫొటోలూ వీడియోలను మ్యూజియంలో భద్రపరిచారు. ప్రపంచంలో రికార్డు చేసిన జాతి హత్యల ఘటనలో అర్మేనియా జెనోసైడ్ మొదటిది. ఆ ఊచకోత తరవాత అర్మేనియా రష్యా పాలనలోకి వెళ్లిపోయింది. సోవియట్ యూనియన్ పతనానంతరం ఇది స్వతంత్ర దేశంగా అవతరించింది. తరవాత ఎత్తైన కొండమీద ఉన్న ఖోర్ విరాప్ అనే క్రైస్తవాశ్రమానికి వెళ్లాం. అక్కడ నుంచి చూస్తే అరారత్ పర్వతాలు ఆకాశాన్ని తాకుతున్న దృశ్యం కనువిందు చేస్తుంది. ఈ ఖోర్ విరాప్ చుట్టూ అన్నీ పంటపొలాలూ పచ్చికబయళ్లూ ఉన్నాయి. కొంత దూరంలో ఫెన్సింగ్ వేసిన టర్కీ సరిహద్దు కనిపించింది. అక్కడ నుంచి నగరంలోని దల్మాఆల్ అనే షాపింగ్‌మాల్‌కి వెళ్లాం.

అర్మేనియాలో వైద్య విద్య చదవడానికయ్యే ఖర్చు మనతో పోలిస్తే చాలా తక్కువ. అలాగే పాఠశాలల్లో చదరంగం తప్పనిసరి పాఠ్యాంశం. అందుకే నగరంలో టైగ్రన్ పెట్రోసియన్ చెస్ హౌస్‌లో తరచూ అంతర్జాతీయ స్థాయి పోటీలు జరుగుతూనే ఉంటాయి. అర్మేనియన్ల భోజనంలో లవష్ అనే బ్రెడ్డు తప్పనిసరి. నమిలినట్లుగా తినే దీన్ని నేలమాళిగలో ఏర్పాటుచేసిన టోనిర్ అనే ఓవెన్‌లో ప్రత్యేక పద్ధతిలో తయారుచేస్తారు. అందుకే ఇది ఏడాదిపాటు నిల్వ ఉంటుందట. ఆ విధంగా వేల సంవత్సరాల నుంచీ నివాసప్రాంతంగా ఉన్న పురాతన నగరాన్ని చూశామన్న అనుభూతితో వెనుతిరిగాం. ★

